# తెలుగు ముళ్ళుగులు

(సంశోధిత విస్తృత పునర్ముద్రణ)

సంగ్రాహకుడు

చీమకుర్తి శేషగిరిరావు




తెలుగు గోష్ఠి

1-9-34/4/E, రామనగర్

హైదరాబాదు - 500 048

TELUGU MARUGULU - A Compilation of some of the deliberations of TELUGU GOSHTHI, an institution devoted to research in history, language and culture of Andhra Pradesh

తెలుగు గోష్ఠి ప్రచురణ 4

ద్వితీయ ముద్రణ : 1992

ప్రతులు : 500

వెల: రూ.

ప్రతులకు .
చీమకుర్తి శేషగిరిరావు
'తెలుగు గోష్ఠి'
1-9-34/4/E, రామనగర్,
హైదరాబాదు - 500 048

ముద్రణ
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/B/1, న్యూ బాకారం,
గాంధీనగర్, హైదరాబాదు-500 380.
ఫోన్ 611413

ప్రథమ ముద్రణ

# పరిచయము

తెలుగు ప్రజల సాంస్కృతిక చరిత్రలో మరుగుపడియున్న వివిధ విషయములను వెలికి తెచ్చుటలో ఆసక్తి వహించిన ఒక మిత్రబృందము, అట్టి ఆశయ సాధనకై పరిమిత స్థాయిలోనైనను ఒక చర్చావేదిక అవశ్యకమని భావించి, తేది 2-4-84న, తెలుగు ఉగాది పండుగనాడు, సమావేశమై ఏర్పర చిన సంస్థయే 'తెలుగు గోష్ఠి.' తొలుత తొమ్మిది మంది సభ్యులతో మొదలైన ఈ సంస్థ యందలి సభ్య సంఖ్య ఈనాడు ముప్పదికి మించినది ఈ సంస్థ యందలి కార్యక్రమములు అచ్చముగ ఐచ్ఛిక కృషి వలననే సాగుచున్నవి. చెల్లించవలసిన సభ్యత్వపు రుసుము ఏదియు లేదు, పదవుల ప్రసక్తియు లేదు. సభ్యులందరును సమాన స్థాయిలో వ్యవహరించి, విషయములను దురభినివేశ రహితముగ చర్చించి సాధ్యమైనంత సామాన్యాంగీకృతిని సాధించుటయే తెలుగు గోష్ఠి తన ముందుంచుకొనిన లక్ష్యము

సంస్కృతికి మూలకందము భాష భాష రూపుగొన్నపుడే మానవుని చరిత్రయు మొదలైనది. భాష యందలి ప్రతిపదము వెనుక సాంస్కృతిక చరిత్ర ఏదియో కొంత మరుగుపడియే ఉండును. కావున సాంస్కృతిక విషయ పరిశీలనకు ప్రాతిపదికగ, తెలుగు పదములలో కొన్నింటి మరుగు పడిన అర్థ విశేషములను వెలికి తెచ్చుటకై గోష్ఠి మొదలిడినది.

తెలుగు దేశములోని ప్రాచీన యుగపు నాణెములందును, శాసనముల లోను కనబడుచు ఇప్పుడు దురవగాహములుగ ఉన్న వ్యక్తినామముల పరిశీల నతో ఆ కృషి మొదలైనది. క్రీ పూ. ఒకటవ శతాబ్దికి చెందిన 'పులుమావి' నామపు చర్చతో మొదలైన ఆ కృషి. శాసనస్థములగు తక్కురీతుల పదము లకును వ్యాపించినది. పై కృషితో పాటుగ తెలుగుదేశపు చరిత్రలో అజ్ఞాత ములై ఉండిన కొన్ని విషయాలపై తాము జరిపిన పరిశోధన ఫలితములను సభ్యులు కొందరు వివరించుటయు, వానిని వ్యాసముల రూపమున గోష్ఠికి అందజేయుటయు జరిగినవి.

తెలుగు గోష్ఠి తన సమావేశములందు తొలుతటి రెండేండ్లలో సాధించిన కృషి ఫలితములను గ్రంధ రూపమున వెలువరించుటకు సంకల్పించినది. ఆ సంకల్పపు ఫలితమే ఈ 'తెలుగు మెఱుగులు.' ఇందు శాసనములలోని 33 పద విశేషములపై గోష్ఠి జరిపిన నిర్ణయములతో పాటుగ, సాంస్కృతిక విషయములకు సంబంధించిన మూడు వ్యాసములును కలవు.

తెలుగు గోష్ఠికి తొలుత నుండియు పలు వ్యక్తుల, సంస్థల ప్రోత్సాహాదరణలు లభించినవి.

గోష్ఠి కార్యక్రమముల నిర్వహణకై పండితుడు, చారిత్రక పరిశోధకుడు. శ్రీ బి ఎన్. శాస్త్రి భూరి విరాళమును ఇచ్చి ప్రోత్సహించెను.

తెలుగు గోష్ఠి సాగించు సాంస్కృతిక కృషికి సాయపడు సంకల్పముతో విద్వన్మిత్రుడు, పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధిపతి శ్రీ పి. శ్రీనివాస్ తగు ధన సాహాయ్యమొసగి గౌరవించెను.

గోష్ఠి సమావేశములకై తొలుతనుండియు నెలవొసగి ప్రోత్సహించినది తెలుగు భాషా సమితి. తరువాతి కాలమున ఆ సమితి తెలుగు విశ్వవిద్యాలయమున సంలీనమైనది. అయినను ఆ విశ్వవిద్యాలయము కూడ, సమావేశపు వసతిని గోష్ఠికి కొనసాగనిచ్చి ఆదరించినది.

తెలుగు గోష్ఠి చర్చలను ఎడనెడ ఆంధ్రపత్రిక-సచిత్రవారపత్రికలో, హైదరాబాదు నోట్‌బుక్ ద్వారా ప్రచురించి, ఆంధ్రపత్రికా సంపాదకుడు గోష్ఠికి తగు ప్రచారమును కల్పించెను.

తెలుగు గోష్ఠి వెలువరించిన ఈతొలి ప్రచురణ 'తెలుగు మఱుగులు'ను ముద్రించి ప్రచురించుటకై తెలుగు విజ్ఞాన పీఠము రు 4000/- ఆర్థిక సాహాయ్యమును కల్పించుటకు వాగ్దానము చేసినది తరువాతి కాలమున ఆ పీఠమును తనలో లీనము చేసికొనిన తెలుగు విశ్వవిద్యాలయము, ఆ వాగ్దానమును ఆమోదించి, ఆ సాహాయ్యమును అందించినది.

—పై అందరకును తెలుగు గోష్ఠి సదా కృతజ్ఞతతో ముడిపడియున్నది.

హైదరాబాదు<br>10-12-86

సంచాలకుడు<br>'తెలుగు గోష్ఠి'

ద్వితీయ ముద్రణ

# మనవి

తెలుగు గోష్ఠికి ఇప్పటికి యెనిమిది ఏండ్లు నిండినవి. నెలవారీగా జరుగు సమావేశములలో 100 వ సమావేశము ఈనాడు (11-7-1992) న జరుగుచున్నది.

గోష్ఠి సమావేశములందు శ్రద్ధ వహించి సభ్యులు పాల్గొని, తెలుగు సంస్కృతి, చరిత్రలకు సంబంధించిన అనేక విషయాలను చర్చించగా, తత్ఫలితముగ అనేక నూత్నాంశములు తెలియవచ్చినవి. వానిలో కొన్ని మాత్రమే తెలుగు గోష్ఠి తన ప్రచురణలద్వారా వెలువరింపగల్గినది. ఇంకను మిగిలి యున్నవి ఎన్నియో ఉన్నది వానిని ప్రకటింపవలసియున్నది.

తెలుగుగోష్ఠి ప్రచురణలలో తొలుతదియగు 'తెలుగు మణుగులు' అనతికాలముననే చెల్లుబడి అయినది. అందువలన తెలుగుగోష్ఠి తన నూరవ సమావేశ సందర్భమున దానిని సంశోధించి, కొత్త విషయాలను పెక్కింటిని చేర్చి ఈ ద్వితీయ ముద్రణను వెలువరించినది.

సభ్యులును, అభిమానులును అందించు సహకారము వలననే తెలుగు గోష్ఠి తన కార్యక్రమములను నిర్వహించుచు, ప్రచురణలను వెలువరించు చున్నది. పుస్తక ప్రచురణ బహువ్యయ జనకమైన ఈ కాలమున, తగు వనరులను అందులకై ఆర్జించుటలో గోష్ఠి కొంత శ్రమపడవలసి వచ్చుచున్నది. అందువలననే ప్రచురణలకై విషయసామగ్రి సిద్ధముగ ఉన్నను, ఆశించినంత త్వరగా వానిని ప్రచురించ లేకున్నది.

యథాపూర్వపు రీతిలో ఈ గ్రంథపు ముద్రణకై సభ్యులును, అభిమానులును సాయపడిరి. గ్రంథ ముద్రణకై కాగితమును కొనుటకు భూరివిరాళ మొసగి సాయపడిన వారు, తెలుగు గోష్ఠి సంస్థాపక సభ్యుడు శ్రీ యార్లగడ్డ

ఆంజనేయులు. ఆ విధముగనే ముద్రణ వ్యయమును ఆదుకొనుటకై ధన సాహాయ్య మొసగి సాయపడిన అభిమానులు . శ్రీ ఆత్మకూరి కృష్ణమూర్తి, శ్రీ అయినంపూడి చక్రధర్, శ్రీ డి గంగాధరరావు.

తొలుతనుండియు సాయపడుచున్న రీతిగా, ఈ గ్రంథ ముద్రణను తగు ఉదార భావనతో నిర్వహించి సాయపడినది పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ ప్రొప్రైటరు శ్రీ పి. శ్రీనివాస్

తెలుగు గోష్ఠి సమావేశములకు నిరంతరాయముగ తొలుత నుండియు నెలవొసగి, సౌకర్యములను కల్పించి సాయపడుచున్నవారు తెలుగు విశ్వ విద్యాలయాధికారులు.

వీరికి అందరికి తెలుగు గోష్ఠి సదా కృతజ్ఞతతో ముడివడి ఉండగలదు.

హైదరాబాదు
11-7-92

**అవధానుల విజయకుమారబాబు**
కార్యదర్శి, తెలుగు గోష్ఠి.

# విషయసూచిక

1. శాసనములలోని పదాలు

## సంకేతముల వివరణ

| | |
|---|---|
| అ. సా. ప. ప. | ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక |
| ఎ. అ. | Epigraphia Andhrica |
| ఎ. ఆర్. | Archaelogical Annual Report |
| ఎ. ఇ. | Epigraphia Indica |
| తె శా. | తెలుగు శాసనాలు (సం డాక్టరు పి. వి- పరబ్రహ్మ శాస్త్రి) |
| ద్రా. ని. | అకరాది ద్రావిడాంధ్ర నిఘంటువు (సం కందాడై శేషాచార్యులు) |
| నె శా. | Nellore District Inscriptions |
| ప్రా. శా. | ప్రాచీనాంధ్ర శాసనాలు |
| భా. | భారతి మాసపత్రిక |
| లూ. ప. | Luder"s list |
| సూ. ఆ ని | సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు |
| సౌ. ఇ. | South Indian Inscriptions |

# 1. శాసనములలోని పదాలు

**అంధక:** తెలుగు భాషకును, తెలుగు దేశమునకును పేరుగ ప్రాచీన కాలమున వాడుక యందుండిన నామ విశేషము.

'అంధక' పదము బౌద్ధ సాహిత్యమున విరివిగ కననగుచున్నది. 'సుత్తనిపాతము' లోని 'పరాయన' వర్గమున 'వత్థుగాథ'లో ఉదాహృతులగు అస్సక, అళ (ముళ) కులు అంధక రాజులని అట ఒక ప్రాచీన వ్యాఖ్యలో ఈయబడినది అస్సక, అళకములు నేటి తెలంగాణము నందలి 'బోధన్' ప్రాంతమున ఉంచెడి జనపదములని చారిత్రకుల అభిప్రాయము 'అంధక రట్ఠము' గోదావరి తీరములను ఆశ్రయించి యుండెనని బౌద్ధ గ్రంథములే పేర్కొనినవి అంధక రట్ఠపు బౌద్ధులు చైత్యారాధకులనియు, అందు పూర్వశైలీయ, అపరశైలీయాది సంప్రదాయములు ఉండెడి వనియు బౌద్ధ గ్రంథముల వలన తెలియుచున్నది. ఈ పూర్వశైల, అపరశైలములు కృష్ణా తటములను ఆశ్రయించి, ధాన్యకటక ప్రాంతమున ఉండెడివని యువాన్ చ్వాంగ్ మొదలగు యాత్రికుల వ్రాతల వలన సుస్పష్టము ఐతరేయ బ్రాహ్మణమున పేర్కొన బడిన 'అంధ్ర' జాతియే ఈ 'అంధక' జాతిగ వ్యవహృతమయ్యెననియు పండితులందరు అంగీకరించిరి ఇటుల 'అంధ్ర' పదమే ప్రాకృతమున 'అంధక' గ మార్పొందినది 'అంధక రట్ఠ' మునే 'అంధాపథ' అని వ్యవహరించుటయు పరిపాటియైనటుల కొన్ని శాసనముల వలన సుస్పష్టము (మైదవోలు శాసనము ఎ. ఇ. **VI.** పుట. **86**). ఈ విధముగ గోదావరీ, కృష్ణాతటములను ఆశ్రయించిన తెలుగు దేశము ప్రాచీనకాలమున 'అంధక' 'అంధ' నామములతో వ్యవహృతమయ్యెననుట సోపపత్తికము

ఇక ఆ కాలమున తెలుగుదేశమున వ్యాప్తి యందుండిన దేశభాషయు 'అంధక' అనియే వ్యవహృతమయ్యెనని బౌద్ధ గ్రంథములే రుజువు చేయుచున్నవి క్రీ. శ. **400** ప్రాంతపు వాడుగ నిర్దిష్టముగ

తెలియవచ్చుచున్న బుద్ధఘోషుడు- 'మజ్ఝిమనికాయము'పై 'పపంచ సూదని' అను వ్యాఖ్యను రచించుచు- తనకు పూర్వులగు కొందరు ఆచార్యులు దమిళ, అంధకాది దేశభాషలలోనికి బౌద్ధ పిటకములను అనువదించి యుండిరనెను అందువలన క్రీ. శ. 4 వ శతాబ్ది నాటికే 'అంధకము' ఒక సాహిత్య భాషగ రాణించెననుట స్పష్టము. ఈ విషయమునే చర్చించిన పాళీభాషా పండితుడు నలినాక్షదత్తు తెలుగు భాష యొక్క ప్రాచీన రూపమే అంధకము అగుననెను (చూ : హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ఇండియన్ పీపిల్ - భారతీయ విద్యాభవన్ ప్రచురణ - సం III; పు. 396 ) ప్రాచీనపు ఆ తెలుగుభాష యందలి సాహిత్యము వైదికేతరములగు బౌద్ధ జైనములను - ఆనాటి చారిత్రక పరిస్థితులను బట్టి - ఆశ్రయించి యుండును. ఆ మతములకు తెలుగు దేశమున ఆదరణ నశించుటతో, ఆ సాహిత్యము సైతము అంతరించినది.

**అక్షోదక ధారాపూర్వకము :** శాసన సహితముగ ఇచ్చిన దానము.

15 వ శ లోని ఒక శాసనములో కనబడు ఈ సమాసమునకు 'అక్షతలతో నీరు విడిచి చేసినది' అను అర్థము ఈయబడినది 'అక్ష' అనగ అక్షతలు అనుకొనటవలన ఈ పొరపాటు జరిగినది 'అక్ష' అనగ 'చెక్కించిన అక్షరములు కలది' (శాసనము) అని అర్థము అందువలన శాసనము ఇచ్చి ధారాపూర్వకముగ చేసినది అనియే దీని అర్థము

**అణపోతులు :** కులపు పెద్దలు.

రేనాటి చోళుల పొట్లదుర్తి - మాలెపాడు శాసనమున ఈ పదము కననగు చున్నది. అర్థనిర్ణయమున పండితులు విభిన్నాభిప్రాయములను వెలువరించిరి ఇందలి "అణ" అనునది 'అన' లేదా 'అన్న'కు మారు రూపమనియు, 'పోతు' శ్రేష్ఠవాచకమనియు కొందరు తలచిరి (ప్రా శా పు. 210) ఆ అర్థమును గ్రహించిన యెడల 'పెద్దన్నలు' అను అర్థము ఏర్పడును, కాని దానికి ఇచట సందర్భశుద్ధి ఉండదు ఇక కొందరు గ్రహించిన 'ఆజ్ఞప్తులు' ధ్వనిసామ్యమున సరికుదిరినను,

అర్థవంతము కాదు రాజశాసనమునకు ఒకే ఒక అజ్ఞప్తి ఉండుట సహజము అందువలన బహువచనము అసంబద్ధమగును. అంతేకాదు, 'అజ్ఞప్తి' పదము 'అణపోతు'గ మారనేరదు.

ఇక 'అణ' అనునది నేడు వ్యావహారికాంధ్రమున కన్పడు 'ఆణ'కు పూర్వరూపముగ సంభావింపదగియున్నది. పశువుల వంగడములను గురించి మాటాడునపుడు 'దాని ఆణము మంచిది, దీని ఆణము చెడ్డది' అనునవి పల్లెపట్టులందు తరచుగ వినసగును. 'ఆణ' అనునది 'అన్వయ' అను సంస్కృతపదపు వికృతి. దీని తొలి రూపము 'అణ' యగును. ఈనాడు ఆ పదము పశువుల విషయమునకే నియతమైనను, తొలుత ఇది మనుష్యులకును వర్తించియుండును 'పోతు' అను పదమును సైతము ఈ కాలమున మానవులకు వర్తింప జేయుట లేదు. కాని రేనాటి చోళుల కాలమున ఈ రెండు పదములను మానవుల విషయమున సైతము వర్తింపజేసిరి కావున 'అణపోతులు' అనుదానికి ఇందుమూలమున 'కులపు పెద్దలు' అను అర్థము ఏర్పడి, శాసనమున చక్కగ సరికుదురును

**అన :** ఊటనీటి మడుపు, ఆరంభ కృషి.

ఈ పదము 15వ శతాబ్దికి చెందిన ఒక శాసనమున కననగు చున్నది (నె శా రాపూర్ 41.) దీనికి శాసన పరిష్కర్తలు 'అడ్డకట్ట' (కాజ్‌వే) అను అర్థమును ఇచ్చిరి ఆ అర్థము అచట సరి కుదరదు. 'పెద్ద అనకట్ట కిందను చోడె పందుము పరిమడి' అనునది శాసన పాఠము.

'అన' అను పదము కావ్యములలోనికి గాని, తెలుగు నిఘంటువులలోనికి గాని ఎక్కని ఒక వ్యావసాయిక పదము. దానికి 'ఊటనీటి మడుపు' అనియే అర్థము. ఆ అర్థమున ఆ పదము ఈ కాలమున సైతము, పూర్వపు నెల్లూరు జిల్లాలో చేరియుండిన ఒంగోలు తాలూకా మొదలగు ప్రాంతములలో వాడుక యందున్నది ఆ ప్రాంతములందు ఒక్కొకచోట సహజముగనే ఊటనీరు భూమిపైకి వచ్చుచుండును. దానికే 'అన' అని పేరు. దాని చుట్టును ఒక కట్టను నిర్మించి,

అందుండి ఒక కాలువను రూపొందించి, ఆ కాలువలో వచ్చు నీటిని వంతుల ప్రకారము ఉపయోగించుకొని రైతులు తమ భూములను సాగు చేసికొనెదరు. అట్టి సాగుబడినే 'ఆనకట్ట క్రింద సాగు' అనెదరు

బహుశః కాలువకు మొదలు 'అన' అగుటచేతనే గాబోలు, ఈ 'అన' కాలక్రమమున వ్యావసాయికేతర రంగములలో కొన్నింట 'ఆరంభ కృషి' అను అర్థమును గ్రహించినది 'అన వేయుట' అనగా మొదలిడుట యని, అట్టి సందర్భమున, అర్థము ముఖ్యముగ మంచమును అల్లుటలో ఈ పదము పల్లెపట్టులందు విరివిగ వాడుకలో ఉన్నది. మంచపు అల్లికకై తొలుత జరుగు పుల్లల అమరింపును 'అనవేయుట' అని అనెదరు.

ఇక సూ.రా ని మొదలగు తెలుగు నిఘంటువులు 'అన' అను దానికి అగ్ర సోదరుడు, చిగురుటాకు అను అర్థములను ఇచ్చినవి. ఇవియు 'అన' అనుటకు 'తొలుతటి' 'ఆరంభపు' అను అర్థములు కలవనుటను రుజువు చేయుచున్నవి.

**ఆడ్లుపట్టు (ఆడ్లపట్లు, ఆళ్లపట్టు)** : పంట భూమి, ధాన్య క్షేత్రము-అనగా గడ్డిబీడుగాని ఊషరభూమిగాని కానిది.

తెలుగు శాసనములలో ప్రాచీనతమములగు రేనాటి చోళుల శాసనములందును, తదనంతరమున తూర్పు చాళుక్యుల శాసనములందును ఎడనెడ కననైన ఈ పదము, శాసన పరిష్కర్తల చేతులలో విపరీతార్థమునకు లోనైనది; ఎనుబదిపుట్లు అడ్లపట్టు = ఎనుబది పుట్ల ఆళ్ళ (ఆరికల) విత్తనములను చల్లుటకు తగిన వైశాల్యము కలిగిన భూమి అను అర్థమును వారు కల్పించిరి. (ఎ ఇ. XIX. 47). ఒక చిన్న గ్రామమున 80 పుట్ల ఆరిక విత్తనములు చల్లుటకు తగినంత భూమి ఉండనేరదని వారు గుర్తింపరైరి. ఆడ్లు = ఆరికలు అనియు, పుట్టి = కొలపుట్టి అనియు భావించుటయే వారు జరిపిన పొరపాటు. పుట్టి = 500 కుంటలు, కుంట = ఒక చదరపు దండము అను నిర్ణయము గణితశాస్త్రరీత్యా అంతకు చాల పూర్వముననే జరిగెననియు,

పావులూరు మల్లన తన సార సంగ్రహ గణితమున క్రీ. శ. 12 వ శతాబ్దములో దానిని గ్రంథస్థము చేసెననియు వారు గుర్తింపరైరి ఇక 'అడ్లు' అనునది సామాన్య ధాన్యవాచకము 'అరికలు' అను అర్థము దానికి ఆ కాలమున లేదు. నన్నయభట్టు రచించిన భారత భాగమున 'అరికలు' పదమే కన్పట్టు చున్నది (చూ ఆంధ్ర మహాభారతము-అర-4 295). సంస్కృతమున 'ధాన్య' అను పదము తొలుత 'ధాన్య' సామాన్య వాచకమై కొన్ని యెడల కుస్తుంబురుల (ధనియాల) కును వర్తించినట్లు, 'అడ్లు' తొలుత ధాన్యసామాన్య వాచకమై కాలక్రమమున 'అళ్ళు' అను వికృతినొంది, అరికలకును వర్తించినది. 'ప్రాలు' అనుదానిలో 'అడ్లు' పదపు వికృతి కాననగును ఉత్తర భారత శాసనములందు కాననగు 'ధాన్యక్షేత్ర'మునకు తెలుగు రూపమే 'అడ్లపట్టు' అనుట సముచితము.

**ఆఱువేల (నాడు)** : 'అర్వేలనాడు' అను పదవు భ్రంశరూపము; 'అధిక విస్తృతిని ఆర్జించిన వెలనాడు' అనియే మౌలికపదవు అర్థము.

శాసనములకు ఎక్కక పూర్వమే భ్రంశరూపమును పొందినది "ఆర్వేల" పదము తెలుగు దేశమున "నాడు"ల ఏర్పాటు తొలి పల్లవులకు పూర్వముననే జరిగి యుండుననుటకు చారిత్రకాధారములు కలవు. ప్రాకృత శాసనములు ఈ నాడులను రట్ఠములని పేర్కొనినవి. ఆ శాసనములలో కమ్మ రట్ఠపు ప్రసక్తి కలదు. తొలి పల్లవుల శాసనములలో ముండ రాష్ట్రపు ప్రసక్తికలదు. నాడులకు ఏర్పడిన ఆ పేరులలో కొన్నింటి వ్యుత్పత్త్యర్థములను వివరించుటయే అసాధ్యము నతవాడి (నాతవాడి) మొదలగునవి అట్టివియే ఇక ఆ నాడుల పేరుల చివర ఒక సంఖ్య కొన్నింట కననగుచున్నది 'రేనాడు ఏడువేలు' మొదలగునవి ఇట్టివియే ఈ చివరి సంఖ్య గ్రామ సంఖ్యయా? లేక కమతముల సంఖ్యయా? లేక వేరు రీతిదా అనుట ఇప్పటికిని తేలని సమస్య

అది ఎటులున్నను ఆ నాడులలో కొన్ని అంతటంతట ప్రక్కనాడులలోని ప్రాంతములను కొన్నింటిని లోగొని విస్తృతిలో మార్పొందినపుడు, తదనుగుణముగ పేరున కూడ మార్పు కలిగెననుట శాసన సాక్ష్యము వలన రుజువగుచున్నది, నతవాడినాడు ఈ విధముగ విస్తృతిని

ఆర్జించి పెన్నతవాడిగ మార్పొందినది, పెద్దదిగా మార్పొందిన నత వాడి అని దాని అర్థము అటులే వెలనాడు విస్తృతి చెందినపుడు 'ఆర్వెల నాడు'గ మార్పొందినది 'ఆర" అనునది విస్తృతిలో పెంపుదలను సూచించును. "ఆరబోసిన", అను పదమున ఈ అర్థమే ద్యోతకమగు చున్నది. తమిళమునను'ఆరమ్' పదము అధిక విస్తృతిని లేదా అధిక్య మును తెలియజేయును.

కాని ఈ 'అర్వెల' పదము శాసనములలో ఎక్కునాటికి 'ఆఱు వేల'గ మార్పొందినది. ఇందులకు ముఖ్య కారణము ధ్వని సాన్ని హిత్యమే. 'ఆర్వెల' పదపు అర్థము స్మృతినుండి లుప్తమైనపుడు చిరపరితమగు 'ఆఱువేల'గ అది మార్పొందుట సహజము

సంఖ్యలు ముందున్న నాడులు తెలుగుదేశమున వేరుగ ఎచటను లేనపుడు 'ఆఱువేల' అను నాడు ఏర్పడుట అసహజము అయినను దీనిని అట్టి సంఖ్యగనే భావించి సంస్కృత పండితులు 'షట్సహస్ర విషయము'గ కొన్ని శాసనములందు సంస్కృతీకరించిరి ఇది అంతయు హామిల్టన్ బ్రిడ్జి - అంబట్టన్ బ్రిడ్జిగను, తరువాత అదియే బార్బర్స్ బ్రిడ్జిగను ఆంగ్లీకరింపబడిన ఘటనకు అన్ని విధముల సరి తూగునది.

తెలుగుదేశమునందలి ఒక బ్రాహ్మణ శాఖకును ఈ నాడును అనుసరించి పేరేర్పడినది. అది తొలుత అర్వెలనాడేయై యుండును, కాని తరువాత నిజమగు అర్థము మరుగుపడగా, ఆఱువేల గ్రామముల నాడుగ దానిని గ్రహించి, తదనుగుణముగ ఒక కట్టుకథను ఆనాటి వారలు ప్రచారములోనికి తెచ్చిరి. అది గోపరాజు రామయ ప్రధానికి సంబంధించినది. అతడు ఆ శాఖకు చెందిన వారికి ఆఱువేల గ్రామ ముల కరణీకములను గజపతి సింహాసనస్థు డయిన గణపతిదేవ మహా రాజు దయవలన శా. శ 1067 (క్రీ శ. 1145) లో ఆర్జించి పెట్టెనని వారనెదరు. అందులకు సంబంధించిన మెకంజీ కయిఫియతులలో అన్నింట ఆ తీరుననే ఆ తేది ఎట్టి మార్పును లేకుండ పేర్కొనబడి నది. చారిత్రకులకు తెలియవచ్చి నంతవరకు క్రీ. శ 15 వ శతాబ్ది దనుక ఆంధ్రదేశమున గజపతుల పాలనయే లేదు; ఆ గజపతులలో

గణపతి అనువాడు కలికమునకైనను కానరాడు అదియంతయు ఒక అభూతకల్పన.

అంతేకాదు, తెలుగుదేశపు శాసనములలో తొట్టతొలుతగ శా.శ 983 (క్రీ.శ 1061) కు చెందిన వలివేరు శాసనము (సౌ.ఇ 10 సం. నెం 8) న 'ఆఱువేల' పదము కననగుచున్నది అనగా పై కట్టు కథలో పేర్కొనబడిన శా.శ. 1067 కు 84 సంవత్సరముల పూర్వము ననే 'ఆఱువేల' పేరు వ్యాప్తిలో ఉండెననియు, 6000 గ్రామముల కరణీకముల గాథకు చారిత్రక ప్రతిపత్తి లేదనుటయు సుస్పష్టము.

ఇక ఆ తొలుతటి శాసనమున కన్పట్టు 'ఆఱువేల వెలనాణ్టి' పదమునకు అర్వెలనాటిలో అంతర్భాగమగు వెలనాడు అని అర్థము చెప్పదగును ఇటులనే వేరొక శాసనము (ఎ. ఇ XIX పు 137)న 'వేఙ్గి వెలనాణ్డు' అని కలదు, వేఙ్గి దేశమున అంతర్భాగమగు వెల నాడు అనియే అచటి అర్థము

'ఆర' పదమునకు ఇట్టి వికృతియే దక్షిణదేశపు కొన్ని శాసన ములందు 'ఆర్కాడు' అను సందర్భమున కలిగినది 'ఆర్కాడు' అనగా అధిక విస్తృతి కలిగిన అరణ్యమనియే అర్థము. కాని దానిని సంస్కృత పండితులు 'షడారణ్య' అని సంస్కృతమున అనువదించిరి.

**ఇనప ఎడ్లు (ఇన్ప ఎడ్లు, ఈనుప యెడ్లు):** దేవస్వపు పశువులు.

శాసన పరిష్కర్తలను, నైఘంటికులను తబ్బిబ్బు పరచి, ప్రతి యొక్కనికి ఒక్కొక్కరీతిగ అర్థస్ఫురణను కలిగించినది ఈ పదము. ఇనప ఎడ్లు = నల్లని పశువులు, అనగా నల్లని ఆవులో లేదా ఎనుములో కావచ్చునని ఒక పరిష్కర్త అనెను. (ప్రా. శా పు. 231). ఒక శాస నములోని సంస్కృత భాగమును ఆధారముగ గ్రహించి అవి ఆవులే యగునని సోమశేఖరశర్మ అనెను ఈను + ఎడ్లు అను రీతిగ విభజించి అర్థ వివరణ చేయుటకు యత్నించిన సూర్యరాయ ఆంధ్ర నిఘంటువు, ఈ పదమునకు గొఱ్ఱెలు లేదా మేకలు అను అర్థమును ఇచ్చెను ఆయా పెద్దలు ఇచ్చిన అర్థములు వారి శాసన పాఠములకు సరికుదిరినవే కాని తక్కినవానికి జతకుదరకున్నవి అందువలన 'ఇనప ఎడ్లు' అనునది

గొఱ్ఱెలను, మేకలను, ఆవులను, ఎనుములను తెలియజేయు ఒక సామాన్యవాచకము కాక తప్పదు అయినపుడు దాని రూపనిష్పత్తి ఎట్టిది? 'ఇనప' అనునది 'హిరణవ' అను ప్రాకృత పదపు వికృతి ఈప్రాకృత పదము భట్టిప్రోలునందలి కరండ శాసనము (క్రీ పూ 3 వ శతాబ్ది) న కననగుచున్నది 'హిరణవ' అను పదపు సంస్కృ తచ్ఛాయ 'హిరణ్యవ' నైఘంటికులు దీనికి 'దేవస్వము' లేదా 'ధర్మ స్వము'- అను అర్ధమును ఇచ్చిరి. కావున ఇనపఎడ్లు = దేవస్వపు పశు వులు అను అర్థమును గ్రహించినపుడు అందు ఆవులు, గొఱ్ఱెలు మొద లగునవియు స్థానము లను ఆర్జించ గలుగును

భట్టిప్రోలులోని శాసనమున కననగు 'హిరణవ ఘవ' అను దానికి 'హిరణ్య వ్యాఘ్రపాద' అను సంస్కృతచ్ఛాయను బర్జెస్ పండితుడు కల్పించి, అర్థ వివరణకై యత్నించెను అట్టి పేరు, బౌద్ధ సారస్వతమున, ఎచటను కన్పడదు 'హిరణవ ఘవ' అనగ దేవస్వ రక్షకుడు అనియే అర్థము. 'ఘవ' అనునది 'గృహ' శబ్దమునకు ప్రాకృత రూపము. 'గృహ' పదమునకు తొలుతటి యర్థము 'రక్షక' అనియే. (చూ· మోనియర్ విలియమ్స్ సంకలిత సంస్కృత - ఆంగ్ల నిఘంటువు.)

**ఉత్పత్తి పిడుగు :** చూ. శ్రీ ఉత్పత్తి పిడుగు.

**ఎరికల్ (ఎరికల్ల, ఎరిగల్, ఎరిగల్లు) :** శ్రీమాన్, శ్రీమత్.

తెలుగు భాషలోని శాసనములందెల్ల - తెలియవచ్చినంతవరకు - ప్రాచీనతమమగు కలమళ్ళ శాసనమున (ఎ. ఇ XXVII 221-25) ఈ పదము తొలుతగ కన్పట్టుచున్నది; అది రేనాటిచోళ ప్రభువగు ధనంజయుడు ఇచ్చిన శాసనము, తరువాతి కాలపు రేనాటి చోళులలో కొందరి శాసనములందును కొలది మార్పులతో ఈ పదము కన్పడు చున్నది శాసన పరిష్కర్తలలో కొందరు ఇదియొక రేనాటి చోళ ప్రభుని పేరనిరి ఒక పరిష్కర్త అది ఒక రాజబిరుద మనెను, కాని ఆ బిరుదపు అర్థమేమియో తెలుపలేదు. రేనాటి చోళుల వంశానుక్రమ ణికలను తెలుపు రెండు తామ్ర శాసనములు కలవు. వానిలో ఎచటను 'ఎరికల్' అను రాజే కనరాడు. కావున అది 'రాజనామము' కానేరదు:

ఆ పదము ఒక విశేషణము మాత్రమే సంస్కృత పదములకు పర్యాయ రూపములగు తెలుగు పదములను రేనాటి చోళులు ఎక్కువగ అభిమానించిరి, బహుళ పక్షమును 'చీకు' అనియు, శుక్ల పక్షమును 'పెంపు' అనియు వారు తెనిగించిరి. 'ఎరికల్' అను దానిలోని అంత్యపు 'ల్' గౌరవ వాచకము మాత్రమే 'ఎరిక' అనునదియే ముఖ్య పదము ఇది 'ఏలిక' పదము వంటిది 'ఎరి' అను ధాతువు 'ఎరియు' అను క్రియ యందు కన్పట్టుచున్నది ఎరియు = ప్రజ్వరిల్లు, మండు, శోభిల్లు అను అర్థములు తెలుగు సారస్వతమున కననగు చున్నవి అందువలన 'శోభ' లేదా 'శ్రీ' కలవాడు 'ఎరిక' అగును. పిండితార్థమున ఎరిక = శ్రీమాన్ అను అర్థము కలుగును ఇక తక్కిన రూపములు దాని వికృతులే యగును.

**ఎహువుల (ఎహువళ, ఎహువుళ) :** ఇక్ష్వాకుల కాలమున అతి విస్తృతముగ పూజలను పొందిన ఒక దేవుని నామము. ఆ పేరును ఇక్ష్వాకు వంశపు ప్రభువులలో కొందరు తమ నామములందు అంత ర్భాగము చేసికొనిరి. ఉ: ఎహువుల చాతమూల, ఏలి ఎహువుల దాసం నక.

క్రీ.శ రెండవ, మూడవ శతాబ్దములలో తెలుగుదేశమున అత్య ధిక భాగమును పాలించిన ఇక్ష్వాకు రాజవంశమున మూడవ తరము నాడు వాసిష్ఠిపుత్ర ఎహువుల చాతమూలుడు. (ఎ ఇ XX పు. 22). ఈ ఎహువులయే కొలది మార్పులతో-ఎహువల, ఎహవుళ, ఎహువుళ అను వికృతులుగ-ఆ ఇక్ష్వాకురాజుల ఇతర శాసనములందు కననగుచు న్నది సంస్కృత, ప్రాకృతములకు చెందక దేశ ప్రజలందు వ్యాప్తిలో ఉన్న ఒక దేశీయ నామమునకు బ్రాహ్మీలిపిలో లిఖిత రూపము కల్పిం చుటతో ఏర్పడిన వికృతులుగ వానిని భావింపవచ్చును.

ఈ 'ఎహువుల' పదపు అర్థమును గ్రహించుటలో మనకు సాయపడు వేరొక పదము ఇక్ష్వాకుల శాసనములం దొకచోట కలదు. అది 'ఏలి ఎహువుల దాసంనక' అను పదము (ఎ. ఇ. XXXVపు. II).

ఇక్ష్వాకు కుటుంబమునకు చెందిన ఒక రాకుమారుని పేరది వీరి ఎహూ వుల దాసుడు అని దాని అర్థమనుట సుస్పష్టము ఆ కాలమున 'ఏలి ఎహూవు'లను దేవీ, దేవమూర్తుల పూజ దేశమున వ్యాప్తి యందుండెనని భావింపవచ్చును.

ఈ 'ఎహూవుల' పదము తరువాతి కాలమున పొందిన పలు మార్పులను గురించిగాని, ఆ పదపు వ్యుత్పత్తిని గురించిగాని తెలిసి కొనుటకు ఆధారములు ప్రస్తుతమున లభించుట లేదు. అయినను ఇక్ష్వా కుల రాజధాని యగు విజయపురి (నేటి నాగార్జున సాగర్) ప్రాంతమున పూజలను పొందుచున్న "ఏలేశ్వరుని" పేరున 'ఎహావుల' పదము గర్భితమై ఉన్నదని భావింపవచ్చును.

'ఎహావుల' పదమే పశ్చిమాంధ్రమున 'ఓబల'గా పరిణమించి తరువాత 'అహోబల'గ సంస్కృతీకరింపబడెననియు తోచుచున్నది.

తెలుగుదేశమున పెక్కు తావులందు కననగు ఏలేరు, ఏలూరు పదములును 'ఏలపాట' లను జానపద గీతములును ఆ 'ఏలి ఎహూవుల' ఒకనాటి ప్రశస్తిని తెలుపు అవశేషములు.

**ఏలి :** చూ. ఎహూవుల

**కాట్టిశర్మ :** కాట్టుదేవుని పేర ఏర్పడిన ఒక వ్యక్తినామము. (ఈ 'కాట్టు' దేవుని పూజ తెలుగుదేశమున ఒకప్పుడు విరివిగ ఉండెడిది.)

తొలి పల్లవులలో ఒకడగు కుమార విష్ణువు ఇచ్చిన ఒక దాన శాసనమున కన్పట్టు బ్రాహ్మణ నామములలో ఇది ఒకటి ఆ శాసనమున దాదాపుగ నూరు పేరులు కలవు. ఈ నామములలో. కుల నిర్దేశముగ చివరన చేర్చబడిన 'శర్మ' పదమును లెక్కలోనికి తీసికొనక పరిశీ లించినయెడల అందు దాదాపుగ 80 పేరులు దేశికి చెందినవే తెలుగు దేశపు వ్యక్తినామముల మౌలికార్థ పరిశోధనకు పూనుకొను జిజ్ఞాసువులు తప్పక పరికించవలసిన శాసనమది. అందలి పేరులలో కాట్టిశర్మ, కొట్టిశర్మ, తూర్కశర్మ అనువానిని మాత్రమే గోష్ఠి చర్చించినది.

'కాట్టిశర్మ' పదము వేరగ మరికొన్ని శాసనములందును కన పడుచున్నది. శాసన పరిశోధకులందరును దీనిని 'వ్యక్తి నామము' అని చెప్పి వదలివేసిరేకాని దాని మౌలికార్థమును, దాని మరుగున ఉన్న సాంస్కృతిక విశేషములను చర్చించినవారు కారు

'కాట్టు' అనునది ప్రస్తుతమున తెలుగు నిఘంటువులందు కాన రాదు, ఆ పదము సాహిత్యమునను కన్పడదు దాని వికృతియగు 'కాడు' (=అడవి) అనునది మాత్రము కనపడుచున్నది ఈ 'కాడు' శబ్దమునకు తొలిరూపము 'కాట్టు' అని భావించుటకు శాసనములందును, వ్యావహారిక భాషయందును ఆధారములు కన్పడుచున్నవి. ఆ 'కాట్టు'ను ఒక దేవతా విశేషముగ పూర్వపు తెలుగు ప్రజలు భావించిరి. సంతానము నిచ్చు దేవుడుగ ఆయనకు అత్యంతాదరణ పూర్వమేకాదు, ఈనాడును పలుప్రాంతములందు కలదు కాట్టీడునకు దండముపెట్టి ఒక రకపు కోకను, నిండు చూలాలుగ ఉన్న స్త్రీ, ధరించినయెడల శిశుప్రసవము ఏ ఇబ్బందియు లేక జరుగునను విశ్వాసము తెలుగుదేశమున కొన్ని వర్గముల ప్రజలలో ఉన్నది 'కాట్టీడు' అనునది కాట్రేడునకు వికృతి. 'కాట్టు' దేవుని దేవరాజుగా భావించిన కాలమున ఇట్టిపేరు ఏర్పడి యుండును కాట్రేని పూజకై కొన్ని ప్రదేశములును ఉండినటుల ఆధారములు కలవు. ఒక శాసనమున 'కాట్రేనివనము' అని పేరుకలదు. (ఆ. సా. ప. ప 21.1) "కాట్టు" లేదా కాట్టిదేవునిపేరును బిడ్డలకు పెట్టుకొనెడి వారనుటకు కాట్టిశర్మయే గాక 'కాటయ్య' 'కాటియ' మొదలగు శాసనస్థనామములును, కాటమరాజు మొదలగు ఇతర రీతుల నామములును నిదర్శనములు

'కాట్టు' దేవుని పేరునకు సమానమగు తద్భవ పదమును రూపొం దించుటకు పండితులు చేసిన కృషికి ఫలితమే 'అడవిదేవర' నేడిపుడు అటనట తెలుగుదేశమున కాననగు 'అడవిదేవర పల్లె'లు ఒకపుడు అడవిదేవర అనిపేరున 'కాట్టుదేవుని' పూజకు నిలయములుగ ఉండి యుండును ఇక కాటమరాజు కథలో ఆ రాజు, కాటేశ్వరుని దయ వలన జన్మించెనని కలదు. అందువలన 'కాట్టు' పదమునకు ఈశ్వర పద మును జోడించి శివుడుగ అర్చించుట ఒక కాలమున దేశమున వ్యాప్తి యందు ఉండెనని చెప్పవచ్చును

ఈ కాటేశ్వరుడే, తెలుగుదేశమున 'కాశేశ్వరుడు'గ మారి యుండు ననుట సమంజసముగ తోచుచున్నది. ఉజ్జయిని యందలి మహాకాలుని ఆరాధనయే అచట ఉద్దిష్టమైనచో ఆ దేవుని మహా కాలుడనియే వ్యవహరించెదు వారు ఇక 'కాల' అను పదము సంస్కృత పండితుల దృష్టిలో యమునకే వర్తించును శివుడు వారి దృష్టిలో కాల కాలుడు లేదా మహాకాలుడు కావున 'కాశేశ్వర' నామము 'కాటేశ్వర' పదమునకు వికృతియే యగును

కాళహస్తిలోని దేవుడును తొలుత 'కాట్టు'గ ఉండి శివభావ మొంది నామ వికృతిని పొందియుండును.

ఇంకొక విషయమును కలదు. పల్లవ రాజులకు 'కాడువెట్టి' అను వ్యవహారము కొన్ని గ్రంధములందు కలదు. ఇదియే తరువాత 'కాడవరాయ'గ మార్పొందినది పల్లవులలో తొలి రాజులు శ్రీశైల ఆగ్నేయ భాగపు అడవిని జనావాసముగ మార్చిరనియెడు - పారంపరికముగ వచ్చు- కధనము కలదు ఆ ప్రాంతమున 'కాట్టు' పూజ అధికము ఆ 'కాట్టు' దేవుని భక్తులుగనే తామా రాజ్యమును పాలించు చుండినటుల చెప్పకొనుటకే కాడువెట్టి (కాడు + వెట్టి = కాట్టు దేవుని దాసుడు) అను బిరుదును ఆ ప్రభువులు ధరించియుందురు ఇందులోని 'వెట్టి' పదము రుచించని తరువాత రాజులు 'కాడవరాయ' (=వన రాజ్య పాలకులు) అను రీతిగ దానిని మార్చుకొనిరి

**కిలారము (కిలరము) :** పాలిచ్చు పశువుల మంద.

తెలుగుదేశపు శాసనములలో దేవాలయములందు దీపారాధనాదులకై నిత్యము నేతిని అందింపజేయుటకై దాతలిచ్చెడు పశువులు 'కిలారమున'కు చేర్చబడెడివనుట కననగుచున్నది. (సౌ. ఇ IV. 1010) ఇది దేశ్య పదము కాదనియే శాసన పరిష్కర్తలలో పలువురు భావించిరి. సంస్కృతమునుండి దీని ఉత్పత్తిని సాధించుటకై కృషిచేసిన వారిలో ఒక పండితుడు 'కిలాల' (ఒక జంతువు) పదము నుండి కిలార పదము రూపొందెననెను వేరొకరు 'క్షీరారామ' పదము నుండి దానిని సాధింప యత్నించిరి. కాని అది వారికే సంతృప్తిని కలిగించినది కాదు.

సంస్కృతమున 'కిలాట' అను పదము కలదు ఇది అంత్యాక్షరపు కొలది మార్పులతో సుశ్రుతుని వైద్యసంహితయందును, హరివంశమునను, భవిష్య పురాణమునను కనన్గుచున్నది దీనికి 'చిక్కబరచబడిన పాలు' అని నిఘంటువులు అర్థమును ఇచ్చినవి ఇందువలన 'క్షీర' అనునది సంస్కృతముననే కొంత కాలమునకు 'కిల'గ మార్పొందెననుట స్పష్టము. అట్టి పాలను విరివిగ సమకూర్చు ప్రదేశము 'కిలారము' 'భండార' శబ్దమువలెనే ఈ 'కిలార'మును రూపొందినది

**కూర్చ :** ఇరాన్‌న ప్రప్రథమ ఆర్యరాజ్యమును నెలకొల్పిన 'కురుస్' చక్రవర్తి పేరునకు దక్షిణభారతమున కలిగిన వికృతి. ఈ కూర్చ నామమును పల్లవ రాజొకడు వహించెను. ఇరాన్ నుండి వచ్చిన పహ్లావులే దక్షిణభారతమున పల్లవులై రాజ్యస్థాపకులైరి.

పల్లవులు ఎవరు? అను విషయము చరిత్ర పరిశోధకులలో పలు వివాదములకు దారి తీసినది 'పల్లవ' శబ్దము తెలుగు తమిళ పదములందు దేనికిని సరికుదురదు ఒకవేళ సంస్కృత పదమను కొన్నను, ఆ రాజవంశమునకు ఆ పేరు కలిగిన రీతిని వివరించుట అసాధ్యము.

సాతవాహనులకు శక క్షత్రపులతో సంబంధ బాంధవ్యములు ఉండెడివను విషయము శాసనముల వలననే రుజువగుచున్నది. శక క్షత్రపులతో పాటుగ పహ్లావులును క్రైస్తవ శకారంభముననే భారత దేశమునకు వచ్చిరి. అట్టివారికి సాతవాహనులతో తప్పక పరిచితియు, తగు ఉద్యోగములును లభించియుండును.

ఇట పహ్లావుల గురించియు, ఇరాన్‌ను గురించియు కొన్ని విషయములు చెప్పవలసి యున్నది. ఇరాన్‌న తొలి ఆర్య సామ్రాజ్యమును నెలకొల్పినవాడు కురుస్ (క్రీ పూ. 525). ప్రాచీన ఇరానీయుల భాష వైదిక భాషకు అతి సన్నిహితము కాని, వైదిక భాషలో నామవాచకముల సుబంతము విసర్గగ మారగ, ఇరానీయుల భాషయందు

మాత్రము మారెడిది కాదు. కావున వైదిక భాషలో కురుః శబ్దమువంటిదే ఇరానీలోని 'కురుస్'శబ్దము. 'కురుస్' తో ఆరంభమైన రాజవంశమును క్రీ పూ 331లో గ్రీకు విజేత అలెగ్జాండరు అంతమొందించి గ్రీకుల పరిపాలనను నెలకొల్పెను గ్రీకులను క్రీ పూ 240 లో పార్థవులు (పార్తియనులు) తరిమివైచి, ఇరాన్‌ను వశపరచుకొని ప్రాచీన ఇరానీ భాషా సంస్కృతులను పునరుద్ధరించి, తాము 'కురుస్' ప్రభువంశము నకు చెందినవారమని చెప్పుకొనిరి అంతేగాక తమ కులమును ఇరానీయు లలో ఒక అగ్రకులముగ పరిగణించి, దానికి 'పహ్లావ' అను పేరును కల్పించిరి, తాము అభివృద్ధి చేసిన ప్రాచీన ఇరానీ భాషకు 'పహ్లావీ' అను పేరును కూడ ఏర్పరచిరి 'పహ్లావ' శబ్దము సంస్కృతములోని 'ప్రథమ' శబ్దమునకు సన్నిహితము 'ప్రథమ' నుండి 'పహ్లా' అను పదము ఉత్తరదేశ భాషలలో రూపొందినటులనే ఇరానీలో 'పహ్లావ' ఏర్పడినది

ఆ పహ్లావులు యోధులుగ, సాతవాహనులు మొదలగు భారత రాజవంశముల ప్రాపును ఆర్జించి భారత సంస్కృతితో మేళనమొందినను తాము అగ్రకులమునకు చెందినవారమని భావించుచునే ఉండిరి అందు వలన వారు రాజ్యమును ఆర్జించిన వెనుక సైతము వైదికమతమున అగ్రకులమునకు (బ్రాహ్మణ కులమునకు) చెందినవారుగ పరిగణనను ఆర్జించిరి ఆ రాజులను ఆశ్రయించిన పురోహితులును, పహ్లావులు అవలంబించిన క్షత్రధర్మమును గుర్తించి, క్షత్రధర్మమును అవలంబిం చిన ద్రోణుడను బ్రాహ్మణుని వంశమువారుగ వారికై వంశవృక్షమును తయారుచేసిరి. ఈ వంశవృక్షమే వాయలూరు, వేలూరి పాళియమ్, కాశగుడి శాసనములలో అచ్చటచ్చట కొలది మార్పులతో కాననగు చున్నది

ఇందు ముఖ్యముగ గమనింపదగిన విషయము ఒకటి కలదు వీరకూర్చడను పల్లవ రాజకుమారుడు నాగరాజ పుత్రికను వివాహమాడి ఆమెతోపాటుగ నాగరాజునుండి రాజ్యమునుగూడ గ్రహించెననియు, అంతటితో పల్లవ రాజ్యపాలన మొదలయ్యెననియు ఆ శాసనముల వలన తెలియుచున్నది. ఈ కూర్చని ఉనికి దర్శి మొదలగు కొన్ని తావు

లందలి శాసనముల వలనకూడ రుజువగుచున్నది 'కూర్చ' పదము సంస్కృత, ప్రాకృత, దేశభాషాపదములలో వ్యక్తినామముగ వేరొక చోట కన్పట్టదు నిఘంటువులు ఆ పదమునకు పల్లుదోము పుడక, చిన్న చీపురు మొ॥ అర్థములను మాత్రమే ఇచ్చినవి

పహ్లావులు దక్షిణ భారతమునకు వచ్చి పల్లవ' నామమును పొందినను తొలుతటి వారిలో 'కురుస్' సంతతికి చెందినవారమను విషయము జ్ఞప్తి యందుండియుండును అందువలననే పల్లవరాజ్యమును స్థాపించినవాడు తన పేరును 'కురుస్'గ వ్యవహరించి యుండును. అదియే దేశభాషలో 'కురుచ' గనై 'కూర్చ'గ సంస్కృతీకరింపబడి వంశవృక్షమునకు ఎక్కియుండును.

కావున పహ్లావులే పల్లవులుగ వ్యవహృతులై వైదిక సంస్కృతిని గ్రహించిరనియు, వారి తొలుతటిరాజు — పల్లవులు మూలపురుషుడుగ భావించు—'కురుస్' పేరునే ధరించగా, అదియే 'కూర్చ'గా సంస్కృతీ కరింపబడెననియు భావింపవలసియున్నది

**కొండ : విపణి; వర్తక స్థావరము**

తెలుగు దేశమున పశ్చిమ గోదావరి జిల్లాయందలి పెనుగొండ వంటి గ్రామముల నామములలో చివరన 'కొండ' అను పేరున్నను, ఆ పరిసరములందు కొండలు ఏవియు కనబడవు. ఈ 'పెనుగొండ'యు శాసనస్థపదమే (సౌ ఇ V నెం 171) సమీపమున కొండ ఎట్టిదియు లేనపుడు ఆ గ్రామముల పేరుల చివరన 'కొండ' ఏవిధముగా తావు కల్పించుకొన్నది? ఈ చర్చా సందర్భమున అట్టివేయగు ఉప్పు గొండూరు మొదలగునవియు ప్రసక్తికి వచ్చినవి.

ఈ 'కొండ' అనునది 'కొను' (గ్రహించు) అను ధాతువు నుండి రూపొందినదని గోష్ఠి నిర్ణయించినది అందువలన 'పెనుగొండ' వంటి గ్రామ నామములలోని 'కొండ'కు- వస్తువులనన్నిటిని గ్రహించి ఒకచోట చేర్చిన స్థావరము, విపణి, వర్తక స్థావరము అను అర్థములు ఏర్పడుచున్నవి. ప్రసక్తమగు పెనుగొండ ప్రముఖమగు వర్తకస్థావర మగుట శాసనముల వలనను, సాహిత్యము వలనను తెలియనగుచున్నది; కావున ఆ అర్థమచట సరికుదురును.

ఇట్టిదే ఉప్పుకొండూరు, ఈ గ్రామము ఉప్పలముల (ఉప్పు పండు భూముల)కు అతి సమీపమున ఉన్నది ఉప్పలములందలి ఉప్పును వర్తకులు సేకరించి ఇచ్చట నిలవయుంచి అమ్మెడువారు! ఆ సమీపమున ఇరువది మైళ్ళవరకు కొండ ఎట్టిదియు కన్పట్టదు.

తమిళములోని 'గంగై కొండ' పదము నందలి కొండయు అట్టిదే గంగ వరకు ఉన్న భూమిని తన రాజ్యముగ గ్రహించినవాడని దాని అర్థము. 'కొండ' అను పదమునకు ఉన్న ఈ విశిష్టార్థము ఇప్పటి వరకు నిఘంటువులకు ఎక్కినదికాదు, శాసన పరిష్కర్తలును దానిని గ్రహించినవారు కారు

**కొట్టిశర్మ (కొటియశర్మ):** కొట్టి దేవుని లేదా కొటియ దేవుని పేర ఏర్పడిన నామవిశేషము.

నెల్లూరు జిల్లాలోని పాటూరు గ్రామమున లభ్యమై, శాసన సంపుటములలో చేరని ఒక శాసనమున ఈ నామము తొలుత కానవచ్చు చున్నది. ఈ శాసనమును ఇచ్చినది తొలి పల్లవులలోని సింహవర్మ. అతడు క్రీ శ అయిదవ శతాబ్దికి చెందినవాడు ఆ శాసనమును పరిష్కరించి భారతిలో డా పు వా పరబ్రహ్మశాస్త్రి ప్రచురించెను అందు దాన పరిగ్రహీతలుగ బ్రాహ్మణుల నామములు దాదాపుగ నూరు ఈయ బడినవి. ఇందులో పెక్కు పేరులు దేశ్యములే వానిలోనిదే కొట్టిశర్మ, కొన్ని తావులందు ఇది 'కొటియ'గ కూడ వ్రాయబడినది

'కొడి' అను దానికి నిఘంటువులు 'దీపశిఖ' అని అర్థము ఇచ్చు చున్నవి ఈ "కొడి"కి పూర్వ రూపము "కొటి" అని తోచునున్నది. 'కొట్టకొన' అను పదమున ఈ అర్థము నిలిచియే యున్నది సంస్కృతమునందలి 'కోటి' (కొన) తో దీనికి గల సంబంధము విచారణీయము.

ఈ "కొటి" లేదా "కొటియ" పదము పర్వత శిఖరమునకును వాడబడినటుల "కొట్యదొన" పదము వలన తెలియనగుచున్నది. గుంటూరు జిల్లా యందలి నేటి "కొణిదెన" ఒకప్పుడు "కొట్యదొన" అనబడెడిదని శాసనముల వలన విదితము. కొట్య (కొటియ) దేవుని

దొన (కొలను) ఉన్న ప్రదేశము అని దాని అర్థము. దానిని అనుకొనియే కోటప్ప కొండ కలదు అందలి దేవుడు కోటయ్య. ఈ "కోటయ" యే "కొట్య" దేవుడు. అనగా పర్వత శిఖరమును దేవునిగ భావించి, దానికి రూపకల్పనము చేసి 'కొటియ' లేదా 'కొట్టి' దేవునిగ ప్రజలు తొలుత అర్చించి యుందురు పర్వతమును, లేదా పర్వత శిఖరమును దేవునిగ భావించుట తెలుగు దేశమున పరిపాటిగ కానన్గును" ఆ "కొట్టి" లేదా 'కొటియ' దేవుని పేరుననే "కొట్టిశర్మ" అనునది రూపుగొనెను

**కొండబలి :** నదీ సంగమము; కూడలి. దీనిని ఒక దేవతాస్థానముగ పరిగణించి ప్రాచీనులలో కొందరు తమ నామముగ గ్రహించిరి.

ఇక్ష్వాకుల శాసనములలో ఒకచోట 'కొడబలి సిరి' అను పేరు కానవచ్చుచున్నది ఆమె వీరపురుషదత్తుని పుత్రిక; వనవాస రాజ్య పాలకుని పెండ్లాడినది 'సిరి' అనునది స్త్రీవాచకముగ అట చేర్చబడినది. మిగిలిన 'కొడబలి'కి అర్థవివరణ చేయుటకు శాసన పరిష్కర్తలు ప్రయత్నించినవారు కారు

'కొడ' అను పదమునకు తెలుగున ఒక చోటికి కూడిన నీరు అను అర్థము కలదు తరువాతికాలపు శాసనములందును 'కొడమరవ' అను పదము కానవచ్చును దీనికి చెరువు తూము అను అర్థము అచట సరి కురుచున్నది ఈ 'కొడ' అనునదియే నేటి కాలమున 'కోడు' అను పేర జలాశయమునకు పర్యాయ పదముగ తెలుగుదేశపు కొన్ని ప్రాంతములందు వాడుకలో ఉన్నది ఇక్ష్వాకు శాసనములు బ్రాహ్మీ లిపిలో వ్రాయబడినవి, కాన అచట 'కొడ'ను 'కోడ'గా చదువుటకు వసతి కలదు

ఇక 'బలి' అనునది 'వెల్లువ'కు తొలి రూపమని తోచుచున్నది. 'వెల్లి' 'వెల్లువ'లు సమానార్థకాలు' వెల్లికి 'బలి'తొలిరూపము కావచ్చును లేదా దేశి పదమును గ్రహించుటలో, 'వె'కు బదులుగా 'బ'ను ధ్వని సారూప్యమును బట్టి వాడవచ్చును. అంతేకాదు, 'ఉబ్బలి' అను పదమునందలి 'బలి' నీటివెల్లువను నేడును సూచించుచున్నది అందు

వలన 'కొడబలి'కి ఒకచోట కూడిన ప్రవాహములు అను అర్థము ఏర్ప డును. అనగా నేడు 'సంగము' అని వ్యవహరింపబడునదియే ఆనాడు 'కొడబలి'గా తెలుగున ఉండి యుండును నదీ సంగమములను పుణ్య క్షేత్రములుగా భావించుట, 'సంగయ్య' 'సంగమ్మ' పేరులను పెట్టు కొనుట ఇప్పటికిని తెలుగు దేశమున కలదు

ఇక కూడలి, కొడాలి, కోటిపల్లి, కోటిఫలి - పేరులు అన్నియు 'కొడబలికి' కాలక్రమమున వచ్చిన వికృతులుగ తోచుచున్నవి వీనిని వేరొక తీరున వివరించు మార్గము కన్పట్టుట లేదు.

## చాతమూల (చాంతమూల, చతమూల, చన్తమూల) :

'చాఁత' దేవుని దాసుడు - ఈ నామమును ఇక్ష్వాకు రాజులలో ఇరు వురు కలిగియుండిరి.

నాగార్జున కొండ త్రవ్వకములలో లభించిన ఇక్ష్వాకు రాజుల శాసనములను పరిష్కరించి పరించిన చారిత్రక పరిశోధకులందరును చాతమూలను తద్భవ పదముగ భావించి, దానిని 'శాంతమూల' అని సంస్కరించి, ఆ రాజవంశ చరిత్రలను వ్రాసిర కాని ఇది సంస్కృత ప్రాకృతములలో దేనికి చెందినదియు కాదు ఇందులకు రెండు కారణ ములు కలవు: 1 ఇక్ష్వాకు రాజులు కొందరును, వారికి సన్నిహితుడగు ఆభీరవసుషేణుడును ఆ కాలమున కొన్ని సంస్కృత శాసనములను కూడ ఇచ్చినటుల, అచటి త్రవ్వకముల వలన తెలియనైనది. వాని యందు ఈ రాజ నామము 'శాంతమూల'గ పేర్కొనబడలేదు. పైగా అందొకదానిలో 'చన్తమూల' అని కలదు 2 అది ప్రాకృత పదమే అయి యుండు నెడల, ఆనాటి లేఖకులు, ప్రాకృతముతో చక్కని పరిచితి కలవారగుట వలన, ఆ నామమును ఒక తీరుగనే వ్రాసి యుందురు. ఇటుల గాక ఆ పదమును వివిధ రీతులలో - చాతమూల, చాంతమూల, చతమూల, చతముల, చన్తమూల అని వ్రాయుట జరిగి యుండదు.

అందువలన 'చాత' అనునది దేశభాషలో ఒక దేవుని పేరై ఉండుననియు. ఆ పదమున చా, తల మధ్య ఒక విధమగు అనునాసిక

ధ్వని ఉండెననియు, దానిని బ్రాహ్మీలిపిలో రూపొందించుటకు లేఖకులు వేసిన ప్రయత్నము పరిమితమైనదై ఒక విధ రీతుగ వర్ణించెననియు చెప్పవచ్చును 'చాత' దేవుడె తమిళ ప్రాంతమున 'సాత్తన్' అను క్షుద్రదేవతగ కొంతకాలము ఆరాధనలను పొందెను తెలుగు దేశమున ఈ ఆరాధన ఇప్పుడు కానబడదు, కాని 'చాతబడి' అను అభిచారిక క్రియలో ఆ దేవుని పేరే ఇపుడును కలదు కాలక్రమమున ఆ దేవుడు 'క్షుద్రదేవత'గ లెక్కింపబడినను, క్రీ శ 2,3 శతాబ్దములలో ఉత్తమ దేవతగనే ఉండియుండును దేవతలకు ఆపాదించు క్షుద్ర, ఉత్తమ భావనలు సాంఘిక పరిణామగతిలో అంతటంతట విపర్యయములను పొందినవి 'స్కంది' (కుమారస్వామి) పదమునకు నిఘంటువున లభించు అర్థము దొంగల దైవము, కాని ఆ దేవునికి కాలక్రమమున ఉదాత్తత లభించెను

ఇక 'మూల' అను పదమును దేశ్యపదమే, దీనికి ఇక్ష్వాకు శాసనములలోనే 'ముల' అను రూపమును ఈయబడినది (ఎ. ఇ XXXV పు 11) కావున ళు, ల ల-మధ్య ఒక విచిత్ర దేశీయపు ధ్వని విశేషము ఉండుట వలన దానికి బ్రాహ్మీలిపి సరియైన రూపమును ఈయలేక దానికి దీర్ఘ స్వరముగ భావించి 'మూల' యని ఒక పర్యాయమును, దానిని వదలివేసి 'ముల' అని వేరొక పర్యాయమునను లిఖించియుండును

తూర్పు చాళుక్యుల తొలి శాసనములలో కొన్నింటి 'ముట్టు' అనుపదము కన్పట్టును, దానికి 'దాసులు' 'పనివారు' 'భృత్యులు' అను అర్థము సరికుదురును. ఈ 'ముట్టు' పదము క్రీ. శ. 7 వ శతాబ్ది శాసనములలో కలదు, ఇక దీనికి మూలమగు శబ్దమొకటి, దానికి సన్నిహితమగు రూపమున క్రీ.శ 2, 3 శతాబ్దములందు తెలుగు దేశమున ఉండగా, అదియే 'మూల', లేదా 'ముల' గా ఇక్ష్వాకుల శాసనములలో లిఖితమై యుండును

'ముల' పదమును 'దాస' అను అర్థమున ప్రాకృతము గ్రహించుటుల, ఒక శాసనము (లూ ప 1344) లోని, 'పాదములిక' అను పదమువలన తెలియనగుచున్నది

ఇందువలన 'చాతమూల' అను పదమునకు అర్థము 'చాంత దేవుని దాసుడు' అని ఏర్పడును ఇక్ష్వాకు రాజుల కుటుంబమున ఒకని పేరు 'ఏలి ఎహువుల దాసనక' అనియు కలదు కావున 'చాంతదేవుని దాసుడు' అనునది 'చాతమూల'కు అర్థమనుట సముచితము

**చిత్రరథ : శివుడు.**

క్రీ.శ. 3 వ శతాబ్దికి చెందిన తెలుగు దేశపు సాలంకాయన ప్రభువుల శాసనములలో 'చిత్రరథస్వామి పాదానుజ్ఞాతస్స' అను సమాసమున ఈ పదము కననగుచున్నది దీనికి శాసన పరిష్కర్త లందరును చిత్రరథ=సూర్యుడు అను అర్థమునే ఇచ్చిరి తొలుత ఈ శాసనమును పరిష్కరించిన ఒక పాశ్చాత్య పండితుడు, ఒక నిఘంటువు 'చిత్రరథ' పదమునకు అర్థముగ 'సూర్య' అనుదానిని ఇచ్చెనని చెప్పి, ఆ అర్థమునే ఈయగ, తరువాతివారందరు దానిని అనుసరించిరేగాని ఆ అర్థము అచట సరికుదురునా యను విషయ మును ఆలోచించినవారు కారు. 'చిత్రరథ' పదమునకు 'సూర్య' అను అర్థము నిఘంటువు లందు ఉన్నమాట నిజమే, కాని ఆ అర్థమేగాక, మరికొన్ని నిఘంటువులు వేరుగ అర్థములను సైతము ఇచ్చియున్నవి 'చిత్రరథ' అనునది ఒక సమాసము. 'చిత్రమైన రథము కలవాడు' అనియే దాని అర్థము, కావున అట్టివారందరికి ఆ పదమును వర్తింప జేయవచ్చును. వేదములందు చిత్రరథ పదము 'అగ్ని' కి పర్యాయ నామము, కొన్ని పురాణములందు దుర్గకును పేరుగ ఆ పదము కన నగును, ఒక గంధర్వునికిని అది పేరుగ ఉండినటుల మహాభారతము నందలి అరణ్యపర్వములోని ఒక కథ వలన తెలియవచ్చుచున్నది ఇంతేకాదు, చిత్రరథ పదమునకు ఆ సమాస విగ్రహమునకు భంగము కలుగుగని రీతిలో పెక్కు అర్థములను సాధింపవచ్చును

ఇటుల ఒక పదమునకు నానార్థములు ఉన్నపుడు, సందర్భ శుద్ధికి భంగము కలుగని రీతిలో దానికి అర్థమును కల్పింపవలెను సాలంకాయన శాసనమున ఒక మహారాజునకు విశేషణముగ 'చిత్ర రథస్వామి పాదానుజ్ఞాతస్స' అనునది వాడబడినది, ఆ మహారాజునకే

వర్ణించు తక్కిన విశేషణములలో 'పరమమాహేస్సరస్స' అనునదియు అందే కలదు. (ఎ. ఇ. IX పు. 58) 'పరమ మాహేశ్వరులు' అనగా శివునిదప్ప వేరుగ నెవనిని పూజింపని వీర శైవులు. అందువలన 'చిత్రరథ' అను పదమునకు 'శివుడు' అను అర్థమునే ఇట తప్పక ఈయవలసియుండును.

'చిత్రరథ' అనునది శివునికి వర్ణింపజేయుటలో అనౌచిత్యము ఎట్టిదియు లేదు త్రిపురాసుర సంహారకాలమున భూమి పరమేశ్వరునికి రథమైనది; సూర్యచంద్రులు దాని చక్రములైరి. ఇంతకన్న చిత్రమగు రథము వేరొకటి యెచట నుండును? శివుని లీలలలో త్రిపురాసుర సంహారలీల శైవులకు అత్యంత ఆదరణీయము. అందువలననే శైవులగు సాలంకాయనులు, తమ ఇష్టదైవమును 'చిత్రరథ' నామముతో ప్రతిష్ఠించి సేవించి యుందురనుట సమంజసము.

అంతేకాదు, ఆ శాసనపు కాలమున తెలుగుదేశమున సౌరమతానుయాయులుగాని, సౌరాలయములుగాని ఉన్నటుల నిదర్శనములు ఎట్టివియు కన్పట్టవు. కావున 'చిత్రరథ' అనగ 'శివుడు' అనియే ఇచట అర్థము చెప్పుకొనవలసియున్నది.

**చెన్** : రాగి (లోహము); శ్రీ, శోభావంతమగు.

తెలుగు శాసనములందలి కొన్ని తెలుగు పేరులలో స్థల నామాదులందు పూర్వభాగమున కననయ్యేడు ఈ పదపు వ్యుత్పత్తిని గురించియు, అది యార్జించిన విస్తృతార్థములను గురించియు గోష్ఠి చర్చించినది. "చెంబ్రోలు" (సౌ ఇ. VI 102), చెన్నెఱువు (భా 1, 110-122) పదములు ఈ విషయమున తొలుత గమనింపదగినవి. తమిళమున 'శెన్' అను పదము రాగిని తెలియజేయుటవలన, తెలుగున దాని ప్రతిరూపముగనే 'చెన్'ను గ్రహించి 'చెంబ్రోలు'ను 'తామ్రపురి'గ మధ్యయుగముల పండితులు సంస్కృతీకరించిరి. ఆదిమ మానవునికి తొలుత లభ్యమైన లోహము తామ్రము మాత్రమే అగుట వలన అట్టి లోహోత్పత్తికి లేదా అట్టి లోహోత్పత్తుల క్రయవిక్రయములకు వసతులుగల స్థల నామములలో 'చెన్' పదము పూర్వ భాగముగ

చేరియుండునని ఒక ప్రముఖ పండితుడు ప్రతిపాదించిన వాదనయు కొంతవరకు సమంజసమే కాని ఆ వ్యుత్పత్త్యర్థము అనతికాలముననే విస్మృతీకరింపబడి చెన్ = ఎఱుపు అను అర్థమును పొందినటుల చెన్నెఱుపు పదమువలన స్పష్టము,

ఇక 'కన్' పదము 'కన్ను'గా మారినటులనే 'చెన్' పదముకు 'చెన్ను' గ మారగా, శోభ, శ్రీ - అను అర్థములు కలిగినవి సాహిత్యమున ఇందులకు ప్రమాణములు కోకొల్లలు చెన్నకేశవ, చెన్నమల్లు అను దేవతానామములలో విశేషణముగ వాడబడిన 'చెన్న' పదము శ్రీకి పర్యాయ రూపమగుట సుస్పష్టము సంస్కృతము నందలి 'శ్రీ' పదమునకు పర్యాయపదముగ 'తిరు' పదమువలెనే 'చెన్న' అను పదము కూడ ఒక కాలమున వాడుకయందుండె ననియు, తదనంతరము వాడుక నుండి వైదొలగెననియు, ఇందువలన తెలియవచ్చుచున్నది

**తలవర** : ప్రముఖుడు.

ఇక్ష్వాకురాజుల శాసనములలో (ఎ ఇ XX 1-7) 'మహా తలవర' అను సమాసమున భాగముగ ఈ పదము తొలుత కననగుచున్నది ఇందలి అంత్యాక్షరము అప్పటికి లేఖనమున ఒక స్థిరరూపమును సంతరించుకొనక పోవుటచే 'తలవరియ' 'తలవరిహా' 'తలవరీయ' రూపములతో ఈ పదపు కొన్ని వికృతులును ఆ శాసనములందే కలవు ప్రాకృత శాసనములలో దేశి పదముల లేఖనమున అంత్యాక్షరము ఇట్టి వికృతులను పొందుట తరచుగ ఉండెడిది. అంత్యమున ఉండెడి ఒక దేశి స్వర విశేషమునకు సరియగు లిఖిత రూపమును బ్రాహ్మిలిపిలో కల్పించుటలో లేఖకులు పడిన తబ్బిబ్బులను మాత్రమే ఆ వికృతులు తెలియజేయును

ఇక్ష్వాకుల శాసనములందు మాత్రమేగాదు, అంతకు చాల పూర్వపువిగ - క్రీ పూ ఒకటవ శతాబ్దానికి చెందినవిగ - భావింపదగు కొన్ని ఆంధ్ర దేశీయ నాణెములపైనను 'మహాతలవ...' పదము కననగుచున్నది ఈ నాణెముల ప్రతిరూపములు అముద్రితాలు అందు కొన్ని డా. పి. వి. పరబ్రహ్మశాస్త్రి గారి సేకరణయందును, కొన్ని బిర్లా

మ్యూజియమునకు మరికొన్ని రాష్ట్ర ప్రభుత్వపు మ్యూజియమునను వెలుగులోనికి రాక పడియున్నవి

ఇందువలన 'తలవర' పదము అతి ప్రాచీనత కలిగిన తెలుగు పదముగ విదితమగుచున్నది నాణెములందలి 'మహా తలవర' ఒక మాండలిక ప్రముఖుని హోదాను తెలియజేయు పదము కొందరు తలవరులపై అధికారము కలిగినవాడే మహా తలవరగ లెక్కింపబడి యుండును. కావున 'తలవర' అను పదము ఒక గ్రామముపైననో లేదా కొలది గ్రామాలపైననో అధికారము కలవానిని తెలియజేయును

ఈ తలవర పదమును కిట్టెల్ పండితుడు సంస్కృతమునందలి 'స్థలావారక' నుండి సాధించుటకు యత్నించెను. 'స్థలావారక' అనునది ప్రాచీన రాజ్యపరిపాలకోద్యోగులలో ఎచటను—అశోకుని కాలమున గాని, తదనంతర కాలమున గాని - ప్రాకృత రూపమున సైతము కానరాదు. కావున ఆ ప్రయత్నము దోషయుతము

'తలవర' శబ్దమును తమిళము నందలి 'తలైయార్'కు ప్రతి రూపముగ కొందరు భావించిరి ఇదియు అసమంజసమే. తలైయార్ పదమునకు తెలుగున ప్రతిరూపము 'తలారి' మాత్రమే కాగలుగును. ('పిళ్ళైయార్' అను తమిళ పదము 'పిళ్ళారి'గ తెలుగున ఇటులే రూపొందినది ) కావున అతి ప్రాచీన కాలముననే తెలుగున రూపొందిన 'తలవర' పదమునకు 'తలారి' పదముతో ఎట్టి సంబంధమును కల్పిం చుట సాధ్యము కాదు

ఇక దీని వ్యుత్పత్తి? తెలుగున నేర్పరి, చదువరి మొదలగు పదముల వలెనే 'తలవరి' పదము రూపుగొనినది నేర్పు, చదువు మొదలగు విశేష్యములపై 'అరి' ప్రత్యయము కూడగ 'నేర్పరి' ఇత్యాదులు ఏర్పడినవి, అటులనే తలవు + అరి = తలవరి అయినది. 'తలము' అను దేశి పదము నేడును సాహిత్యమున కననగుచున్నది 'తలమే బ్రహ్మకునైన నీనగమహత్త్వంబెన్న'-అని మనుచరిత్రయందు 'తలము' అనునది 'సాధ్యము' అను అర్థమున ప్రయుక్తము. ఈ 'తలము'నకు ప్రాచీన రూపమే 'తలవు' కాదగును. కావున 'తలవరి

అనగా ఇందువలన ఒక పనిని సాధించు నేర్పుగలవాడు లేదా సమర్థుడు అను అర్థము కలుగుచున్నది అందువలననే స్థానిక పాలకులకు ఆ కాలపు ప్రభువులు ఆ ఉద్యోగనామమును కల్పించియుందురు.

ఇక క్రీ శ 10 వ శతాబ్ది మొదలుగ చాళుక్య - చోళ బంధుత్వము వలన చోళ దేశపు పరిపాలన పద్ధతులు దేవాలయములందును దేశమునను వ్యాప్తిలోనికి రాగా, తమిళదేశపు 'తలైయార్' పదము 'తలారి'గ తెలుగుదేశమునను చొరబారినది అదివరకే తెలుగుదేశమున వ్యాప్తిలో ఉన్న 'తఌవర' (తళవర, శబ్దము, ఉచ్చారణలోని సాన్నిహిత్యమువలన 'తలారి' పదముతో ఏకరూపతను పొంది 'ఊరుగావు' 'ఆరెకుడు' అను అర్థములను సంతరించుకొనినది కాని తలవర, తలారి పదములు వేరువేరు కోవలకు చెందినవనుట పై చర్చవలన సువిదితము.

**తూర్క్రా-శర్మ :** 'తూర్క్రా' అను దేశీయ దేవత పేర ఏర్పడిన ఒక వ్యక్తి నామము. 'తూర్క్రా'యే 'దుర్గ'గ సంస్కృతీకరింపబడినది.

తొలి పల్లవులలోని కుమారవిష్ణువు ఇచ్చిన ఒక దాన శాసనము (చూ॰ పు 10) ననేగాక, తరువాతి కాలమున ఈదేరు శాసనమున (ఎ ఇ V 118-122) సైతము ఈ పేరు కానవచ్చుచున్నది అంతే కాదు, శ్రీనాథునిచేత శృంగార నైషధమును కృతి నందిన మామిడి సింగని పూర్వులలో 'పెద తూర్క్రాన' యను నతడు ఒక డుండెనని ఆ గ్రంథము వలన తెలియుచున్నది (శృంగార నైషధము ఆ 1· ప 20) ఈ 'తూర్క్రా' శబ్దము కీర్తిశేషులు వేదం వేంకటరాయ శాస్త్రి దృష్టిని కూడ ఆకర్షించినది తన 'నిఘంటు కతిపయములు'లో ఆ పండితుడు కొన్ని పద గ్రంథులను చర్చించుచు, వ్యుత్పత్తిని సాధించుటకు వీలుపడని కొన్ని పదములలో 'తూర్క్రా' శబ్దమును కూడ చేర్చెను

నేటి పౌరాణిక దేవతలలో 'దుర్గ' అని వ్యవహృత యగు దేవి ప్రాచీన దేశీయ దేవత యగు 'తూర్క్రా'యే అని గోష్ఠి, తన చర్చల

వలన, నిర్ణయించినది 'దుర్గ' అనార్యుల దేవతగనే తొలుత సంభా వింప బడినది ఈనాడును అచ్చపు ఆర్యావర్తమునకు కడయంచున ఉన్న వంగ, ప్రాచ్యభారత, ఆంధ్ర, కర్ణాటము లందు మాత్రమే దుర్గాపూజకు అత్యాదరణ కలదు ఇక 'దుర్గ' పదమునకు దేవీ పర ముగ అనువైన యర్థమును సంస్కృతమున సాధింప వలను పడదు

తెనుగున ఈ 'తూర్క' పదమునకు దేవీ పరముగ సముచి తార్థమును సాధింప వీలు కలదు 'తూర' అను పదము తెలుగున వర్ష మును తెలియజేయును; 'తూర జల్లనగను ధారాభిధానమౌ' (ఆం భా. 1-95), ఈ పదమే 'తువర'గ తరువాత మార్పొందినది

'తూర' పదమునకు సన్నిహితమే 'తూర్క' పదము ఈ పద మును వర్షాధిదేవతను సూచించుటకై ప్రాచీనులు వాడి యుందురు ఆ వర్షాధిదేవతా నామమునే సంస్కృత పండితులు 'దుర్గ'గ మార్చి, పౌరాణిక దేవీమూర్తిగ ఆమెకు ఆదరణ కల్పించిరి. అయినను ఆంధ్ర దేశమున క్రీ శ 12 వ శతాబ్ది వరకు 'తూర్క' అను ప్రాచీన దేవీ నామము కూడ పండిత లోకమున ఆదరణను పొంది మనగలిగినది.

**పన్నస (పనాస, పన్నవీస, పన్నశ, పన్నాశా, పన్నస్స, పంనస, పనస) :** తాంబూల సహితముగ ఇచ్చిన భూదానము.

'పన్నస' పదము తొలుతగ రేనాటి చోళుల ఎఱ్ఱగుడిపాడు శాసనమున (ఎ ఇ XXVI. 225-228) కననగుచున్నది. తెలుగు శాసనములలో తొలుతటిది ఈ శాసనమే యనియు, క్రీ శ. ఆరవ శతాబ్ది చరమపాదమునకు చెందినదనియు కొందరి నిర్ణయము 'పన్నస' పదమునకు రూపాంతరములుగ పైన తెలుపబడిన తక్కిన పదములు తదనంతర కాలమున అంతటంతట వివిధ శాసనము లందు కననగునవి ఎరగుడిపాడు శాసనమున ఒక భూదానమును తెలియజేయు సందర్భ మున 'ఇచ్చిన పన్నస ఇరువది యాది నాల్కు మఱున్తుణ్ణు నేల' అని కలదు రేనాటి చోళులదే యగు మాలెపాడు శాసనము (సౌ.ఇ X 606) న ఇట్టి భూదాన సందర్భముననే 'ఇరువదియది ఏనుమఱున్తు[డ్ల] ఛాచమానంబు నా ఇచ్చిన దత్తి' అని కన్పట్టుచున్నది కావున రేనాటి

చోళులు 'దత్తి' 'పన్నస' అను వానిని సమానార్థకములుగ గ్రహించి రని స్పష్టమగుచున్నది ఈ విషయమును పండితులు అందరు అంగీక రించిరి.

ఇక 'పన్నస' పదమునకు ఏ తీరుగ 'దత్తి' లేదా 'దత్తము' అను అర్థము కలిగినది? ఈ విషయమున పండితులు ఒక నిర్ణయము నకు రాలేక దానిని, దాదాపుగ, గాలికి వదలివేసిరి. సూ ఆ ని ఈ పదమును కన్నడములోని 'పణ్ణిసు' నుండి సాధించి 'వరివండు నేల' అని అర్థ మొసగినది ఇందు ఈ నిఘంటువు సోమశేఖర శర్మ వాద మును అనుసరించినది కాని నీరు నేలకు ప్రాచీన శాసనము లందెల్ల కొలమానమున 'మఱుతర్లు'ను వాడుదురు కాని కొన్ని 'పన్నస' ఇచ్చిన భూములకు పుట్లు మానమును వాడుట శాసనము లందు కన్పట్టు చున్నది, సూ ఆ ని పన్నస పదమునకు లక్ష్యముగ ఇచ్చిన శాసన మునసే (సౌ.ఇ IV 1101) 'ఖ ంళ ఈ పన్నస' అని కలదు కావున అది వరి పండు నెల కాదనుట తేటతెల్లము

ఇక కొందరు పన్ను చెల్లింపనక్కరలేని భూమి పన్నస అనిరి (ప్రా శా పు 377) రేనాటి చోళుల కాలమున 'పన్ను' అను పదము 'భూమిశిస్తు' అను అర్థమున వ్యాప్తిలో ఉండెనా, లేదా అను విషయ మును సైతము వారాలోచింపలేదు, ఇక 'పన్నస'లో పన్నుపై ఆశ లేదు-అను అర్థము ఎట్లిముడునో వారు తెలుపలేదు

సంస్కృత పండితులు కొందరు దీనిని 'పంచాశత్' అను సంస్కృత పదపు ప్రాకృత రూపమగు 'పణ్ణాసా' నుండి సాధింప యత్నించిరి 'పన్నస' అనగా 'ఏబది కొలమానముల భూమి' అని ఒక వింత అర్థమును తద్వారా వార సాధించిరి 'పన్నస' ఇచ్చిన భూమి ఒక నిర్దిష్ట ప్రమాణమున ఉండవలెననుట శాసనములవలనగాని, శాస్త్ర ములవలనగాని రుజువగుట లేదు కావున ఈ వాదము నిరాధారము

ఇక 'పన్నస' పదమునకు వ్యుత్పత్తిని పాళీభాష నుండి మాత్రమే సాధింప వీలగుచున్నది ఇట ఒక విషయమును చెప్పవలసి యున్నది, తత్సమ రూపములుగ పాళిలో కన్పట్టు కొన్ని పదములు

సంస్కృతమున ఆ అర్థము ఎచటను కన్పట్టదు అట్టి పదములలో 'పర్ణాకార' అనునది యొకటి దీని అర్థము 'దానము' అని రైస్ డేవిడ్స్ సంకలితమగు పాలి-ఆంగ్ల నిఘంటువున ఈయబడినది ఈ అర్థము ఆ పదమునకు ఎట్టుల కలిగియుండునా అను విషయమును రైస్ డేవిడ్స్ చర్చించి, దాన వివరములను ఏదియైన ఒక ఆకుపై వ్రాసి ఇచ్చు ఆచారము బౌద్ధుల కాలమున ఉండి యుండునా అని శంకించెను.

ఇక పాళిలోనే 'పణ్ణ' 'పణ్ణసన్న' పదములును కలవు ఇవియు 'దానము'నకు పర్యాయ పదములే కాని 'పణ్ణసన్న' విషయమున ఒక విశాషార్థము-'దానభూమి హద్దులను సూచించు ఆకులముడి' అని ఈయబడినది

'పణ్ణాకార', 'పణ్ణ', 'పణ్ణసన్న'-పదములు దానమును సూచించినపుడు వానియన్నింట సామాన్య పదముగనున్న 'పణ్ణ' (పర్ణ)మునకు దానముతో సాంప్రదాయిక సంబంధము ఉండుననుట స్పష్టము భారత దేశీయ సంప్రదాయమును బట్టి చూడ ఈ 'పర్ణము' తాంబూల పత్రమే కాదగును ఉత్తర హిందూదేశపు భాషలలో పాన్(పర్ణ) అనునది ఈనాడును తమలపాకునే తెలుపుచున్నది కావున బౌద్ధుల కాలమున దానభూమియొక్క హద్దుల సంధులందు తాంబూలమును పెట్టుట ఆచారమై యుండెనని భావించవచ్చును 'పర్ణాకార' పదముకూడ ఈ అర్థమునే - 'పర్ణముల చేత స్థిరపడిన ఆకారము కలది' అని తెలియజేయుచున్నది 'పర్ణాకార'కు సంక్షిప్తరూపమే 'పణ్ణ' అయి యుండును.

'పణ్ణసన్న'లో అంతము నందలి ద్విరుక్త నకారము, కాలక్రమమున, దేశీయుల ఉచ్చారణలలో ద్రుతరూపమొంది లోపింపగ 'పన్నస' అను పదము రూపొంది, దానమునకు పర్యాయ రూపమయి యుండును దాదాపు వేయి సంవత్సరములు పాళిభాష ఆంధ్రదేశమున మత ధర్మ ప్రచార భాషగ రాణించినది. ఆ భాషలో నుండి దేశభాషలోనికి చొరబారిన చూర్ణ కొలది పదములలో ఈ 'పన్నస' ఒకటి

**పాడి** : ధర్మము ('పాడి' అను పదము ఒక ప్రాకృత భాషా పదపు వికృతియేగాని ద్రావిడభాషా పదము కాదు.)

'పాడి' అను పదమునకు 'ధర్మము' లేదా దానికి సన్నిహితములగు అధికారము, నిర్దేశము వంటి అర్థములు కలవని శాసన పరిష్కర్తలు అందరును అంగీకరించిరి కాని 'పాడి' పదమును ద్రావిడభాషా పదముగ భావించి వ్యుత్పత్తిని సాధించుటకు వారు యత్నించిరి (ప్రా శా పు 384) సూ ఆ ని కూడా ఈ పదమును దేశ్యముగనే గ్రహించినది

యథార్థమున 'పాడి' పదము ప్రాకృతమందలి 'పాళి' పదము నుండి రూపొందినది ఇచ్చట 'పాళి'ని గురించి కొన్ని వివరములను తెలుపవలసి యున్నది 'పాళి' అనుదానిని నేడు పలువురు పండితులు సైతము ఒక భాషా నామముగా భావించి పొరపడుచున్నారు కాని 'పాళి' అనునది బౌద్ధుల పరిభాషలో పిటక త్రయమునకే ఒక విధపు మారుపేరు క్రీ శ 4 వ శతాబ్ది వాడగు బుద్ధఘోషుడు 'పాళీ ధర్మానుశాసనమ్' అని విస్పష్టముగ నిర్వచించెను ప్రాకృత భాషలపై సమగ్ర పరిశీలన జరిపిన ప్రఖ్యాత పండితుడు మేడేపల్లి వెంకట రమణాచార్యులు, స్వరచితమగు 'ప్రాకృత భాషోత్పత్తి' యందు, ఈ విషయమును చర్చించుచు, "దక్షిణ మందుండు బౌద్ధులు తమ పవిత్ర మత గ్రంథములకు 'పాలీ' అని పేరిడిరి ఈ సంజ్ఞ మొదట వారి వేద గ్రంథములకే వర్తించి తరువాత మూల గ్రంథములకు వ్యాఖ్యాన గ్రంథములకుం గూడ వ్యాపించెను" (పు. 10) అని తెలియజేసెను

వేదములందలి భాషను వైదికభాష యన్నటులనే పాళీ (పిటకాదుల)లోని భాషను పాళీ అనుట తరువాతి కాలమున పరిపాటియై అపార్థతకు తావు కల్పించినది కాని బౌద్ధులకు సంబంధించినంత వరకు 'పాళీ' పదపు అర్థము ధర్మానుశాసనమే ఆ బౌద్ధ ధర్మము తెలుగు దేశమున దాదాపుగ వేయి సంవత్సరములు ప్రజల ఆదరణతో మనినది. ఆ కాలమున 'పాళి' పదము 'పాడి'గ పరివర్తన చెంది ధర్మానుశాసనమునకు పర్యాయపదముగ రూఢతను ఆర్జించినది. ఇట్టి 'పాడి' నుండి 'పాటిమూర' వంటి పదములును తెలుగున రూపుగొన్నవి

**పాఱ :** బ్రాహ్మణుడు.

రేనాటిచోళుల తొలిశాసనము (ఎ. ఇ. XXVII. 225-28)ల కాలము మొదలుగ తెలుగు శాసనములలో పెక్కింట ఈ పదము కానగుచున్నది. ప్రథమా విభక్తిని తెలుపు ప్రత్యయముతో 'పాఱుఁడు' అను పదముగ సూ. ఆ. ని యందును ఈ పదము కలదు దీనికి 'బ్రాహ్మణుఁడు' అని అర్థమనుటలో అందరును ఏకీభవించిరి కాని దాని వ్యుత్పత్తి ఎట్టిది?

కొందరు ద్రావిడ భాషా పరిశోధక పండితులు దీనిని 'పారు' (= చూచు, పరిశీలించు) అను ధాతువుతో ముడివెట్టిరి; కాని 'పాఱు' పదమునందలి శకటరేఫ అందులకు అడ్డు తగులుచున్నది రేఫ, శకట రేఫల ప్రయోగములు స్థిర రూపమొందక తబ్బిబ్బగు చుండిన తొలి దశకు చెందిన పదము కానోపుననని వారి సరిపుచ్చుకొనిరి. (ప్రా. శా. పు. 386).

తమిళమున 'పాఱ్‌అమ్' అను ప్రాచీన పదము సాహిత్యమున కలదు, దాని అర్థము 'మంత్రము ' ఆదిమ మానవ సంఘమున మంత్ర తంత్రములతో రోగాదులను శమింప చేయువానికి గౌరవ ప్రతిష్ఠలు అధికముగ ఉండెడివనుట చారిత్రకులు అందరును గుర్తించిన విష యము ఆర్య సంస్కృతి తెలుగు దేశమున ప్రవేశించుటకు పూర్వమున దేశీయ సంఘమునందు ఇట్టి మాంత్రికుడు 'పాఱ' అను పేరున అగ్ర స్థానమున ఉండియుండును. ఆర్య సంస్కృతిలో అగ్రస్థానమున ఉండిన బ్రాహ్మణునితో, స్థాయిని అనుసరించి, 'పాఱ'కును సమానత్వము ఏర్పడగ 'పాఱ' పదము 'బ్రాహ్మణ'కు పర్యాయరూపమై యుండును.

'పాఱ్‌అమ్' పదము ప్రాచీనపు తెలుగునను ఉండియుండె ననుటకు ఒక నిదర్శనము కలదు. ఈనాడును 'మంత్రము పాఱినది' అను ప్రయోగము తెలుగుదేశమున వినవగుచున్నది. ఇచట 'పాఱు' అను క్రియ, 'మంత్రశక్తితో పనిచేయు' అను అర్థమున వాడబడినది. 'పాఱు' క్రియకు ఉన్న ఈ అర్థవిశేషమును తెనుగు నిఘంటువులు గుర్తించినవి కావు

పుణరు పుష్యమ్బు బృహస్పతి హోర : బృహస్పతి హోరా కాలమున, పునర్వసు నక్షత్రాంతము అంతమైంది పుష్యమి వచ్చినప్పుడు.

రేనాటి చోళుల తిప్పలూరు శాసనము (ఎ. ఇ. XXVII 231-234) న కననగు పదసముదాయ మిది. ఈ శాసనము క్రీ. శ. 7 వ శతాబ్దిపూర్వార్ధపుది. ఆ కాలమున తెలుగుదేశమున వాడుక యందుండిన కాలపరిగణనకు సంబంధించిన పారిభాషికత, అందలి అర్ధమును స్పష్టముగానీక శాసన పరిష్కర్తలను తబ్బిబ్బు పరచినది. అందు 'చికుని బదియ సోమవారంబు పుణరు పుష్యమ్బు బృహస్పతి హోరం' అని కలదు. ఇందు చికు = బహుళపక్షము, బదియ = విదియ, సోమ వారపు అర్థము సుస్పష్టము. ఇక తక్కిన భాగమే పరిష్కర్తలను తబ్బిబ్బుపరచినది. ఈ భాగపు అర్థమును గుర్తెరుగుటకై ఆ కాలపు జ్యోతిశ్శాస్త్ర పరిజ్ఞానమును సంప్రదాయమును మనము తెలిసికొనవలసి యున్నది.

వారముల పేరులు ఏర్పడుటకు హోరా విభజనము క్రీ. శ. 5 వ శతాబ్దిలో దారి తీసినది. దినమును 24 హోరలుగ విభజించుటలో ప్రాచీన గ్రీకులు మార్గదర్శకత్వము వహించిరి. వారు అట్టి విభజనను, తమకు పూర్వము వర్ధిల్లిన బేబిలోనియన్ సంస్కృతినుండి గ్రహించి రనువారును కొందరు కలరు. అది ఎటులున్నను ఈ హోరా విభజనము వలన కాల నిర్దేశము కొంత సులువైనది. అప్పటిలో తమకు తెలిసి యుండిన ఐదు గ్రహములకు సూర్య చంద్రులను చేర్చి ఆ హోర లలో ఏడింటికి క్రమముగ శని, గురు, కుజ, రవి, శుక్ర, బుధ, సోమ నామములను ఆ ప్రాచీనులు ఏర్పరచి, వానినే తక్కినవానికిని పునరా వృత్తిలో వర్తింపజేసిరి. ఈ ఏర్పాటు కక్ష్యాస్థితిని బట్టి జరిగినది. ఇక సూర్యోదయ కాలపు హోరతో ఆ దినపు వారనిర్ణయము జరుగవలెనను సంప్రదాయము అందుండి క్రమముగ ఏర్పడినది. ఆదివారమున ఆ విధముగ సూర్యోదయము సూర్యహోరలో జరుగునెడల, హోరా ప్రవృత్తి వలన మరునాటి సూర్యోదయము సోమహోరలో జరిగి ఆ దినము సోమవారమగును, ఆ విధముగనే తక్కిన వారములును నిర్ధారితములు

ప్రోక్తపు శాసనము సోమవారమున దానము జరిగినది ఆనాటి సూర్యోదయ కాలమున వర్తిల్లిన సోమహోర. దానము బృహస్పతి హోరలో జరిగినది, కాని హోరా ప్రవృత్తిని బట్టి బృహస్పతి హోర, సోమవారమునాడు. సాయంకాలము వచ్చును అందువలన ఏ బృహస్పతి హోరయో నిర్దేశింపవలసి వచ్చినది. అందులకై నక్షత్రముల గతిని సాయమున గ్రహించి, పునర్వసు గడచి పుష్యమి వచ్చెడు బృహస్పతి హోర అని నిర్దేశము చేయుట జరిగినది

తరువాతి కాలములో ఈ హోరా గణనమునకు వాడుక తగ్గినది తిథి, వార, నక్షత్రములకు తోడుగ యోగ, కరణములును వ్యాప్తి లోనికి వచ్చి, ఈ పంచాంగముల సాయమున కాల నిర్దేశమును ఘటికా విఘటికలలో చేయుట పిదప ప్రచారమునకు వచ్చి, ఈనాడును అమలులో ఉన్నది

**పులుమావి :** కుమారస్వామి - ఈ దేవుని పేరును తమ పేరుగ సాతవాహన ప్రభువులలో నలుగురు కలిగియుండిరి.

శాసనస్థ పదములలో తొలుతగ తెలుగుగోష్ఠి చర్చించిన పదమిదియే సాతవాహన ప్రభువులలో వాసిష్ఠీపుత్ర పులుమావికి చెందిన నాణెములు లభించినవి అందు ప్రతియొక నాణెముపైనను ప్రాకృత దేశీయభాషల రెండింట బ్రాహ్మీలిపిలో క్రమముగ 'రఞ్ఞో వాసిట్ఠీ పుతస సిరి పులుమావిస' అనియు 'అరహణకు వాహిట్ఠి మాకణకు తిరు పులుమావికు' అనియు వక్కాణములు కాననగుచున్నవి రాజనామము 'పులుమావి' అని ఈ రెండింటి వలన సుస్పష్టము (ఎ. ఆ IV పు 2&3). ఇందువలన మత్స్య వాయు పురాణములలో ఇచ్చిన పటుమావి, పులోమావి, పులోమ - అను, వానిలో ఏదియు ఆ రాజు నామము కాదనియు, 'పులుమావి' యే ఆ పేరనియు రుజువైనది.

ఈ 'పులుమావి' పదము సంస్కృత ప్రాకృత భాషలలో దేనికి చెందినదియు కాదు 'పులుమావి' కాలముననే- క్రీ.పూ ఒకటవ శతాబ్దిలో- దేశభాషయు లేఖన పరసములకు తగినటుల అభివృద్ధిని సాధించి యుండెననుటకు ఆ నాణెముపై దేశభాషలో ఉన్న వక్కాణమే విస్పష్ట

నిదర్శనము ఆ దేశభాషకు ఆ కాలమున 'అంధక' అను పేరుండినటుల బౌద్ధ సారస్వతము వలన వేద్యము (చూ అంధక), అది తెలుగునకు తొలి రూపము

'పులుమావి' అను పదమునకు సరియగు వ్యుత్పత్తిని తెలుగున మాత్రమే సాధించ వలనుపడుచున్నది పులు = తెల్లు; మావి = గర్భస్థ శిశువుకు కప్పియుండు పొర, జరాయువు. పిండితార్థమున 'పులుమావి' అనగా 'తెల్లునుండి జన్మించినవాడు' అని స్పష్టమగును కుమారస్వామి శరజన్ముడు (తెల్లునుండి జన్మించినవాడు) అగుట పురాణగాథల వలన తెలియనగుచున్నది 'పులు' నుండి కుమారస్వామి జన్మించెనను గాథ తెలుగుదేశమున విపుల ప్రచారమును చాలకాలము వరకు కలిగియుండె ననుటకు 16 వ శతాబ్దివాడగు అల్లసాని పెద్దన 'కనుపపులు వేల్పు పడవాలుఁ గన్నచోటు'అని మనుచరిత్రమున వ్రాయుటయే నిదర్శనము

సందర్భవశమున ఇక్కడ ఇంకను కొన్ని విషయములను తెలుపవలసియున్నది పై నాణెమునందు దేశభాషలో కన్పట్టు వక్కాణ మున 'పులుమావి' పదమేగాక అచ్చపు దేశభాషా పదములు మరి మూడు కలవు. అవి మాకణ, తిరు, 'కు' అను షష్ఠీప్రత్యయము ఇందులో 'మాకణ'లోని అంత్య'ణ'కారము గౌరవవాచకము కాగా 'మాక' అను పదము తెలుగులోని 'మగ'కు తొలిరూపము. 'మగ' అను పదము నేడు తెలుగున పురుషపరముగ వాడబడుచున్నను, క్రీశ పదవ శతాబ్ది దనుక శాసనములందు 'మగన్డు' అను పదము 'కొడుకు' అను అర్థమును కలిగియుండినది (సౌ. ఇ. X. 621), 'తిరు' పదము తరువాతి కాలమున శివకవుల రచనములందును, ఆ తరువాత వైష్ణవుల ప్రయోగములందును కాననగుచున్నది 'కు' అను విభక్తి ప్రత్యయము ఇందు ముఖ్యముగ గమనింపదగినది. ఒక్క షష్ఠీవిభక్తి ప్రత్యయముగ మాత్రమేగాక, ప్రథమేతరములగు తక్కిన విభక్తి ప్రత్యయములకు పర్యాయరూపముగ ఆంధ్ర మహాభారత రచనాకాలమున సైతము విరివిగ తెలుగున వ్యాప్తిలో ఉండిన విభక్తి ప్రత్యయమిది. పై పదము లలో కొన్ని తక్కిన దక్షిణదేశ భాషలలో కూడ ఏదియో ఒక రూపమున కాననగుచున్నను, 'పులుమావి' మాత్రము తెలుగు పదమే అనుట

ఎవరును కాదనజాలరు. ఈ విధముగ తెలుగునకు తొలిరూపము ఆ వక్కాణమున కనబడుచున్నది. ఈ విషయమును, ఇందలి భాషా సాంస్కృతిక ప్రాముఖ్యమును తెలుగు భాషా చారిత్రకులలో ఎవ్వరును గమనించకుండుట శోచనీయము

సాతవాహనులు ఔత్తరాహులే యయినను తెలుగుదేశమున చేరిన తరువాత తెలుగుదేశపు సంస్కృతితో చక్కటి మేళనమును పొందిరనుట ఈ నాణెమువలన రుజువగుచున్నది

**పెరుంపల్లి :** మహావిహారము.

తెలుగు శాసనములందు కొన్నింట ఈ పదము కానవచ్చుచున్నది. (సౌ. ఇ X 651) దీనికి ఒక శాసన పరిష్కర్త, పెరుంపల్లిని = మోక్షమార్గములో— అని అర్థము నిచ్చెను (ప్రా. శా. పు 399) ఆ అర్థము సరికుదురదనుట సుస్పష్టము. కొందరు పరిష్కర్తలు పెరుంపల్లిని ఒక స్థల నామముగ భావించి వదలివేసిరి

కాని 'పెరుంపల్లి' అనునది దాక్షిణాత్య బౌద్ధ సంస్కృతికి చెందిన ఒక ప్రాచీన నామము. 'మహావిహారము' అని దాని అర్థము. ప్రసిద్ధ చారిత్రక పరిశోధకుడగు టి యన్. రామచంద్రన్ తాను రచించిన 'బుద్దిస్ట్ ఇండియా అండ్ ది రెస్ట్ ఆఫ్ ఇండియా' అను బృహద్ వ్యాసమున, చోళ సార్వభౌముల గౌరవాదరణలను ఆర్జించిన మలయా బౌద్ధులు క్రీ.శ 11 వ శతాబ్ది ఆరంభమున కనీసము రెండు బౌద్ధ విహారములను - రాజరాజ పెరుంపల్లి, రాజేంద్ర చోళ పెరుంపల్లి అను వానిని నిర్మింపజేసిరనియు, అందు తొలుతటిది రాజరాజ I కాలమునను, రెండవది రాజేంద్ర చోళ I కాలముననను, వారివారి పేరులతో నిర్మితములయి యుండుననియు స్పష్టముగ తెలిపెను - కావున దక్షిణ భారతమున మహావిహారమును దేశభాషలో 'పెరుంపల్లి' అని వ్యవహరించుచుండిరని తెలియుచున్నది 'పల్లి' అనునది మతధర్మ సంబంధి యగు కట్టడమునకు దక్షిణ భారతమున వాడుకలో తొలుత ఉండి యుండును. తమిళమున ఈనాడును మసీదును 'కాజిపల్లి' అనుట

కలదు; కాజీ (ఇస్లామిక మతాచార్యుడు) వసించు ఆరాధనమందిరమని దాని అర్థము

తెలుగుదేశమునను మహావిహారములకు 'పెరుంపల్లి' అను వ్యవహారము తప్పక ఉండియుండును తూర్పు చాళుక్యుల కాలమున బౌద్ధము నామావశిష్టమైనది అందువలన 'పెరుంపల్లి'లును శిథిలతను పొంది, పేరున మాత్రము కొంతకాలము నిలిచి యుండినవనుటకు తొలుత తెలుపబడిన శాసనము ఒక లక్ష్యము. ఒక్కొక్కచోట 'పెరుంపల్లి' పెదపల్లిగ మారియుండును అంతేకాదు; బాపట్ల యందలి 'పెరుంపల్లి' నామము భ్రంశమొంది ప్రేంపల్లిగ మారినది. అందువలననే ఆ విహారపు శిథిలములపై వెలనాటి చోడుల కాలమున రూపొందిన భావనారాయణస్వామి ఆలయమును ప్రేంపల్లి ఆలయముగ శాసనములందు పేర్కొనుట జరిగినది

బౌద్ధుల కాలమున విహారము విద్యాబోధనకును నిలయముగ ఉండెడిది అందువలననే 'పల్లెకూటము' అనగా విద్యాశాల అను అర్థము వ్యవహారమున స్థిరతను ఆర్జించి నేడును తెలుగుదేశపు గ్రామములందు వ్యాప్తిలో ఉన్నది

## పెర్మాడి (పెరమడి, పెర్మడి) : ప్రభువు.

నాగార్జునకొండ శాసనములలో ఒకదాని (ఎ. ఇ XXXIV. పుట 281.) యందు 'పెరమడి' అను రూపమున కన్పట్టు ఈ పదము కడకు పెర్మాడిగ శాసనములందు స్థిరతను ఆర్జించినది. 'పెర్మాడి' అను దేశిపదమును బ్రాహ్మీలిపిలో వ్రాయుటలో ఏర్పడిన అవకతవకలే తొలుతటి అస్థిర రూపములకు కారణములై యుండును

ప్రసక్తమగు నాగార్జునకొండ శాసనము యుద్ధ నిహతుడైన ఒక వీరునికై నిర్మితమగు ఛాయా స్తంభమున కలదు అందలి 'పెరమడి భట'ను ఒక నామ విశేషముగ పరిగణించి శాసన పరిష్కర్తలు వదలి వేసిరి. ఈ పదమే తరువాత నాలుగు శతాబ్దములకు పశ్చిమ గాంగ ప్రభువులలో ఒక బిరుదముగ 'గంగ పెర్మాడి' అని ప్రత్యక్షమైన దనుటను ఆ పరిష్కర్తలు గుర్తింపరైరి.

"పెర్మాడి" అనునది అర్థవంతమగు ఒక బిరుదము. దీనిని 'పెరు + మాడి' అని విభజింపవచ్చును. 'మాడి' అనునది 'మాడువు' నకు తొలిరూపమై యుండును (నుడి, నుడువు-ఇట్టివే). అపుడు పెర్మాడి = పెద్దమేడ (కలవాడు) అను అర్థము ఏర్పడును ఆదిమ సంఘముననేకాదు, నాగరిక యుగపు తొలిదశలలో సైతము సాంఘిక ముగ ఉన్నతస్థాయి యందున్న వానికి మాత్రమే పెద్దఇల్లు ఉండెడిది. 'రాజగృహంబుకన్న నభిరామముగా నిలు కట్టగూడదు' అనుట మహా భారతమున తెలుపబడిన పౌరనీతి. రాజభవనముకన్న పెద్ద ఇంటిని నిర్మించుకొనుట ఒక నేరముగ సైతము పరిగణింపబడెడిది.

ప్రతి దేశపు చరిత్రలో ఒక ఘట్టమున ఈ ఆచారము అమలులో ఉండెడిదనుటకు నిదర్శనములు కలవు ప్రాచీన ఈజిప్టును పాలించిన రాజులకు సామాన్యవాచకముగ 'పేరో' అను పేరుండేది ఈ పదము నకు-పేర్ = పెద్ద; ఓ = ఇల్లు (కలవాడు) అనియే అర్థము; సంస్కృ తమున 'ప్రభు' శబ్దమును ఇట్టిదే, పెద్దఉనికి కలవాడని దానియర్థము

పై చర్చవలన 'పెర్మాడి' అనగా ప్రభువనియు, 'పెరమడి భట' అనగ ప్రభువునకు ముఖ్యభృత్యుడు అనియో లేదా ప్రముఖుడగు భృత్యుడు అనియో అర్థము ఏర్పడును.

## పేరామణి పున్నమ : వైశాఖ పూర్ణిమ.

క్రీ.శ. పదవ శతాబ్ది ఆరంభకాలపు దరిదాపులలోనిదగు కొరవి శాసనము (తె. శా I 162)న ఈ పదము కననగుచున్నది దీనికి పరిష్కర్తలు 'శ్రావణ పూర్ణిమ' అను అర్థమును ఇచ్చిరి. 'ఆమణి'ని 'అవణి'గ గ్రహించి వారు ఆ అపార్థమును కల్పించిరి. 'అవణి' అనునది తమిళ దేశమున శ్రావణమాసమునకు పర్యాయనామము. ఆ 'అవణి' పదము తెలుగున ఎచటను కన్పడదు.

శాసనమున ఉన్నది 'ఆమణి' అను పదము. ఇది 'ఆమని'కి రూపాంతరము. 'ఆమని' అనగ వసంతఋతువు వసంతఋతువున రెండు పూర్ణిమలు-చైత్ర పూర్ణిమ, వైశాఖపూర్ణిమ - మాత్రమే కలవు.

కావున 'పేరామణి పున్నమ' ఆ రెండు పూర్ణిమలలో ఒకటి మాత్రమే కాదగును

వైశాఖ పూర్ణిమ భారతసాంస్కృతిక చరిత్రలో ఒక ప్రత్యేక విశిష్టత కలది. బుద్ధజయంతిగ ఆ దినము బౌద్ధుల కాలమున - దాదాపు వేయి సంవత్సరాలు - తెలుగుదేశమున ఆదరణను ఆర్జించినది. ఇక పౌరాణిక యుగమున సైతము వైశాఖపూర్ణిమకు జరుగు వైశాఖోత్సవములకు ప్రాముఖ్యము ఉండెడిది కావున 'పేరామణి పున్నమ'ను వైశాఖ పూర్ణిమగ గ్రహించుటయే సముచితము.

ఇంకొక విషయమును కలదు. ఆ కాలముననే చైత్ర పౌర్ణిమకు 'అర్మపున్నమ' అను వ్యవహారము ఉండెడిది (వాసుదేవ పరబ్రహ్మశాస్త్రి రచితమగు 'తెలుగు శాసనాలు') కావున పేరామణి పున్నమ వైశాఖ పూర్ణిమయే యగును.

**మఱుతుఱు (మఱుతుడు, మఱుతురు, మఱుత్తుఱు, మత్తరు) :** నీటిసాగు నేలయొక్క వైశాల్యమును తెలుపుటకై, శాసనములందు వాడబడిన ఒక భూపరిమాణ విశేషము. ఒక నిర్దిష్ట ప్రమాణము గల నీటిచే తడుపబడు భూమి - అని దీని మౌలికార్థము. దీనినే సంస్కృతమున నివర్తనము అని వ్యవహరించిరి. 'మఱుతురు' అనగా 20 దండముల వైశాల్యపుభూమి అని కొన్నిట తెలుపబడినను, ఈ పరిమాణ విశేషమున నిర్దిష్టత కన్పట్టదు. కొందరు 30 దండములనిరి.

వ్యుత్పత్తిని నిర్ణయించు విషయమున శాసన పరిష్కర్తలలో పలువురను తబ్బిబ్బు పరచిన పదమిది. ఒకరు దానిని సంస్కృతపు 'మాత్రా' (ఒక కొలత) నుండి సాధింప యత్నించిరి ఒక ద్రావిడ శబ్ద శాస్త్రజ్ఞుడు దీనిని ద్రవిడభాషా పదమగు 'మత్' నుండి సాధింప యత్నించెను. (ప్రా. శా. 435), కాని మఱుతుఱు పదమునందలి శకటరేఫల ఉనికిని ఆయన వివరించలేకపోయెను.

'మఱుతుఱు' పదము శాసనములందు అన్ని సందర్భములలో నీటినేల కొలతకే వాడబడినది. కావున దీనికి చెరువునీటి సాగులోని పారిభాషిక పదములతో సంబంధము ఉండుననుట సుస్పష్టము ఇందు వలన పూర్వకాలపు పంట చెరువుల నిర్మాణమును పరిశీలింతము. పంట చెరువును నిర్మించిన తరువాత తూమును ఒక చోట ఏర్పరచి దాని కెదురుగ చెరువు వెలుపల కొలది దూరమున వలయాకారమున ఒక కట్టను నిర్మించి ఒక చిన్న చెరువును తూమునకు అంటియుండునటుల నిర్మించుట కలదు కొన్ని చోటులందు ఈ చిన్న చెరువు కట్టలను రాతితో నిర్మించుటయు కలదు గుంటూరు జిల్లా చేబ్రోలు నందలి చెరువును ఆనుకొని ఇట్టి కట్టడము చాల కాలము నిలిచియుండినది. ఈ చిన్న చెఱువే "మఱుతురు." దీని నుండి నీరు వెలుపలికి పోవుటకై జలమార్గమును, చెఱువు తూమునకు ఎదురుగాగాక వేరొకవైపున ఉంచె దరు ఇందువలన ఒక ముఖ్య ప్రయోజనము కలదు. చెరువు నిండి యున్నపుడు వేగముతో వచ్చు నీరు కాలువలను తెంచుకొని మాగాణి భూమిని కోసివేయకుండ దీనివలన ఆపి, వేగమును తగ్గించి వేరొక దిశకు దానిని మళ్ళించి, నీరు మెల్లగ పారునటుల చేసి, భూములను కాపాడుటకు వీలగును "మఱుతుఱు" అనగా "నీటి వేగమును తగ్గించి వేరొక దిశకు మరల్చు చిన్న మడుగు" అనియే అర్థము. (తుఱు అనగా తటాకము). సంస్కృతమునందలి నివర్తనమునకు ఇదియే అర్థము. ఈ "మఱుతుఱు" పదము క్రమముగ భ్రంశత చెంది రాయలసీమ మొదలగు చెరువుసాగు సీమలలో మర్తవ, మరవలుగ పరిణమించినది

"మఱుతుఱు" నకు వేరొక ప్రయోజనమును కలదు. మఱుతుఱు ఒకసారి నింపిన తరువాత, చెరువు తూమును కట్టివేసి, 'మఱుతుఱు' లోని నీటిని పారించి తడుప గలుగు నేలకే 'మఱుతుఱు' అనునది వైశాల్య దృష్టిలో కొలత ఏర్పడినది. ఇదియొక నిర్దిష్టపు కొలత కాద నుట యథార్థమే. కాని కొల ప్రమాణములు రూపొందని కాలమున అన్ని లెక్కలును ఇట్లే ఉండినవి ఉదాహరణకు క్రోశము, గవ్యూతి, యోజనములను పరిశీలింతము. ఇందులో 'క్రోశము' అనగా మానవుడు పెద్దగా అరచిన వినబడు దూరము. గవ్యూతి అనగా ఎద్దుఱంకె వినబడు

దూరము; 'యోజనము' అనగా కాడినుండి విడువకుండ జత ఎద్దులు పయనించు దూరము. ఇట్టి కొలతలు అన్నియు అనిర్దిష్టములే. మానవుని సాంస్కృతిక వికసనపు తొలిదశలో ప్రతిచోటను ఇట్టిదే జరిగినది. గణిత పరిజ్ఞానము పెరిగి దండములు, హస్తములు మొదలగు నిర్దిష్ట ప్రామాణిక మానములు ఏర్పడిన తరువాత కూడ, ఆ కొలతలకును క్రోశాది నామములు, అర్థరహితములే యైనను వాడబడినవి.

'మఱుతుఱు' విషయమున కూడ ఇట్టిదే జరిగినది. తొలుత స్థూల రీతిలో 'మఱుతుఱు' నీటిసాగు భూమికి 'మఱుతుఱు' అను పేరు కలిగినను, తరువాతి కాలమున గణితరీతిలో ఏర్పడిన స్థిర వైశాల్యమునకును ఆ పేరే నిలిచినది.

**ముత్తురాజు (ల్)** : మహారాజు.

రేనాటి చోళుల శాసనములందు ఈ పదము కనబడుచున్నది. దీనిని వ్యక్తినామమని కొందరనిరి. అట్టిదది కాదనుట రేనాటి చోళుల చరిత్రవలన సుస్పష్టము. (చూ. ఎరిగల్). 'ముత్తు' పదమునకు 'ముదుసలి' అను అర్థమును మాత్రమే ఇచ్చి, ఆ పదమునకు నిఘంటువులు అన్యాయము చేసినవి 'ముత్తుపల్లి' మొదలగు స్థల నామములకు ఈ అర్థము సరికుదురదు ముత్తు = మహా అను అర్థమే చక్కగ సరికుదురును అంతేకాదు, రేనాటి చోళుల శాసనములలో 'ముత్తురాజుల్' వచ్చిన చోట 'మహారాజ' పదము కన్పడదు; 'మహారాజు' పదమును వాడిన శాసనమున 'ముత్తురాజు' పదము కనబడదు కావున 'మహారాజు' 'ముత్తురాజు' పదములు సమానార్థకములు.

**మున్నూరు సానులు, మున్నూరు అయ్యలు** : దైవ సన్నిధిన ఉండి, ఊరేగింపు సమయమున ముందునడచుచు నాట్యమాడు దేవదాసీ గణము, జంత్రవాద్యముల మేళగాండ్రు.

సంఖ్యావాచకము కాకపోయినను సంఖ్యావాచకముగ భావింపబడి, శాసన పరిష్కర్తలను తబ్బిబ్బుపరచి, అపార్థమునకు లోనైనది పై పద సముదాయములోని 'మున్నూరు' పదము. సూ. ఆ. ని

యందును ఈ పదము చర్చింపబడి, 'మూడు వందలు' అను అపార్థమే ఈయబడినది చేబ్రోలు శాసనమున (సౌ ఇ. VI 101) ఒక దేవాలయమునకు ఇచ్చిన దాన విషయమున ఈ పదసముదాయము వాడబడినది. దీనికి మూడువందల దేవదాసీలు, మూడువందల మేళగాండ్రు అను అర్థమును శాసన పరిష్కర్తలు కల్పించిరి.

ఒక దేవాలయమున మూడువందల దేవదాసీలును, అదే సంఖ్యలో మేళగాండ్రును విధిగ ఉండి తీరవలయునను నియమము ఏ ఆగమము నను కన్పట్టదు, అట్టి సంప్రదాయము ఉండినటుల ఆంధ్రదేశములో మాత్రమేకాదు, తక్కిన దక్షిణ భారతీయ రాష్ట్రములందును వినరాదు. దాదాపు క్రీ.శ. 10, 11 వ శతాబ్దములు మొదలుగ నిరంతరాయముగ పూజాదులు నిర్వహింపబడుచున్న ద్రాక్షారామాది క్షేత్రములందుగాని, తమిళనాడులోని బృహదీశ్వరాలయమునగాని ఒక నిర్దిష్ట సంఖ్యలో తౌర్యత్రికులు ఉండినటుల ఎవరును ఏనాడును పేర్కొనలేదు. ప్రసక్తమగు శాసనము కన్పట్టిన చేబ్రోలున గూడ అట్టి సంప్రదాయము వినరాదు. కావున 'మున్నూరు సానులు .'లోని 'మున్నూరు' పదమును సంఖ్యావాచకముగ గ్రహించుట సంప్రదాయ విరుద్ధము, హేతువాద వ్యతిరేకము

అంతేకాదు, 'మున్నూరు' అను పదమును సంఖ్యావాచక విశేషణముగ మానవులకు వాడుట వ్యాకరణ విరుద్ధము, తెలుగు పలుకుబడికి అది సరికుదురదు మానవులకు విశేషణముగ దానిని వాడునపుడు 'మున్నూర్వురు' అను రూపమును అది ఆర్జించును శాసనస్థ పదము నందలి ఈ అసంబద్ధతను గుర్తించియే సూ. ఆ ని. ఆ పదమున 'ర్వు' అనునది లుప్తమైనదని భావించి, దానిని అచ్చట బ్రాకెట్లలో చేర్చినది. కాని ఆ పదము ఆ తీరుగనే 'మున్నూరు'గనే బాపట్లలోను, ఇతరములందును లభించు శాసనములందు కన్పట్టుచున్నది కావున ఆ పదమును 'మున్నూర్వురు' అని సవరించుట ఒక అపచారము కాగలదు. కావున ఆ పదము సంఖ్యావాచకము కాదని నిర్ణయించుకొని వేరుగ, హేతుబద్ధమగు తీరున అర్థమును సాధింపవలసియున్నది

'మున్నూరు' పదమును 'మున్ను + ఊరు' అని పద విభజన చేయవచ్చును. ఇందు 'ఊరు' అనునది క్రియాజన్యమగు విశేషణము. ఈ క్రియ దాని వ్యతిరేక క్త్వార్థక రూపమున 'ఊరక' అను తీరున మాత్రమే తెలుగున నిలిచినది. మౌలిక క్రియ యగు 'ఊరు' వ్యవహారమునుండి లుప్తమైనది నీరు ఊరుట, దుంప ఊరుట మొదలగు కొన్ని వ్యవహారములందు ఆ క్రియ నిలిచియున్నను, దాని తొలుతటి అర్థములన్నియు నేడు వ్యాప్తిలో లేవు. అంతేకాదు, 'నీరు ఊరుట'లో ఉన్న 'ఊరు' క్రియలో అంత్యాక్షరము శకటరేఫ అని అప్పకవి అభిప్రాయము. కావున 'ఊరక' అను వ్యతిరేక క్త్వార్థకమునకు మూలమై, సాధారణ రేఫాంతమగు 'ఊరు' అను క్రియ తెనుగున భారత రచనా కాలమునాటికే దాదాపుగ లుప్తమై 'మున్నూరు' పదమున మాత్రమే నిలిచియుండెనని భావించుటకు ఆస్కారము కలదు

ఈ క్రియ యొక్క అర్థమును 'ఊరక' అను పదపు అర్థము నుండి మనము ఊహింపవచ్చును 'ఊరక' అనగా 'కదలక, పలుకక, నిశ్శబ్దముగా' అను అర్థములు కలవు. అందువలన 'ఊరు' అను క్రియ 'కదలుట, పలుకుట, ధ్వని చేయుట' అను అర్థములను కలిగినటుల నిర్ణయింపవచ్చును. అపుడు 'మున్నూరు' పదమునకు 'ముందుగా (అనగా దేవునికి ముందర) పోవుచు, (గాన నాట్యాదులచే) శబ్దాదులను కలిగించు' అను అర్థము ఏర్పడును. దేవదాసీలును, మేళగాండ్రును చేయు పనులు ఇవియే గదా!

అంతేకాదు సౌ ఇ శాసనములలోని IV. 989 యందు 'వింద్యసాని మున్నూర వసమున' అని కలదు. ఇచ్చట 'మున్నూర' విశేష్యము. ఇచట సంఖ్యావాచకార్థము ఏ విధముగను సరి కుదరదు. 'దేవుని ముందుగ నాట్యాదులను చేయుట కులవృత్తిగా కలది' అను అర్థము మాత్రమే సరికుదురును

ఇక కొన్ని శాసనములందు 'మున్నూటి' అనియు రూపము కనవచ్చుచున్నది. దానిని ఆయా సందర్భములను బట్టి అర్థకల్పన చేయవలసి యున్నది ఒకవేళ అది దేవదాసికే వర్తించిన, అంత్య రేఫ- 'కావేటి రంగా' ఇత్యాదులందువలెనే-'టి'గా మారియుండును.

**రేనాడు** : 'హిరణ్య రాష్ట్ర' పదపు తెలుగు రూపమిది. ఇది ఒక ప్రాంతపు నామముగ ఆంధ్రప్రదేశ చరిత్రయందు కనబడుచున్నది.

తెలుగు చోళులు తమ శాసనములందు తాము పాలించు ప్రాంతమును 'రేనాడు' అని వ్యవహరించిరి. వారికే చెందిన దొంగల నంద్యాల తామ్ర ఫలకమున ఆ రాజ్యము 'హిరణ్యరాష్ట్రము'గ పేర్కొనబడినది. ఈ పదములు రెండును పర్యాయ పదములే అని గోష్ఠి నిర్ణయించినది.

'రేనాడు'నకు అర్థ కల్పన చేయుటకై కృషి చేసిన కొందరు దానిని 'రేగడినాడు', 'రేవులనాడు' 'రేగులనాడు' అను రూపములతో వివరించుటకు యత్నించిరి. వానిని అర్థరహితములనియు, 'రేనాడు' స్వభావమును అవి వివరింపజాలవనియు గోష్ఠి వానిని త్రోసి పుచ్చినది

ఇక్ష్వాకుల కాలమున హిరణకులు, పూగీయులు మొదలగువారు వారి సామంతులుగ ఆంధ్రదేశపు వివిధ ప్రాంతములను పాలించినటుల వారి శాసనములు తెలుపుచున్నవి పూగీయుల పేర పూగినాడు ఏర్పడునటుల ఆ కాలమున హిరణకుల పేర 'హిరణనాడు' కూడ ఏర్పడియుండుట సహజము. 'హిరణ' అను సంస్కృత పదము 'అరణ'గా తెలుగున రూపొందినటులనే 'హిరణ' పదము 'ఇరన'గ, మారును. తరువాత స్వర వ్యత్యయమువలన 'ఇరన'యే 'రేన'గ మారగ 'నాడు'తో కలిసి అది 'రేనాడు'గ పరిణమించినది 'హిరణనాడు' యొక్క సంస్కృత రూపమే 'హిరణ్య రాష్ట్ర'ముగ దొంగల నంద్యాల శాసనమున పేర్కొనబడినది

**శ్రాహి (శ్రహి)**: మొదలై జరుగుతుండగా, వర్తమానాబ్దము కాగా.

తూర్పు చాళుక్యుల శాసనములందు ఈ పదము తొలుతగా కానవచ్చుచున్నది. గుజరాత్ ప్రాంతపు చాళుక్యుల నుండి ఈ పదము వీరికి సంక్రమించినది. ఈ పదపు అర్థమును గురించి శాసన పరిష్కర్తలు విభిన్నాభిప్రాయములను వెలువరించిరి కొందరు శ్రాహి యనునది 'శ్రీః' కిమారు రూపమని తలచి 'పవిత్రమైన' అను అర్థమిచ్చిరి, వేరొకరు 'పండ్రెండు నెలల కాలము'ను ఆ పదము తెలియజేయుననిరి ఆ అర్థములలో ఏదియు శాసన పాఠములను అర్థము చేసికొనుటకు ఉపకరించదనుటకు ఈ క్రింది పాఠములు లక్ష్యములు.

1 స్వస్తి ... ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సర 12 శ్రాహి విషు సంక్రాంతి సందర్భమున.. (రాజమండ్రి శాసనం ఎ.ఆర్ నెం. 400, 1932-33)

2. స్వస్తి ప్రవర్ధమాన విజయరాజ్య సంవత్సరములు మూడగు శ్రాహి గంగ్గంగొండ్ల చోడ వలనాంటి (సర్వవరం శాసనము. సౌ ఇ. II. 6 12)

3. ...చాళుక్య విక్రమ సంవత్సరములు 5 శ్రాహి శ్రీ యమేశ్వర మహాదేవరకు (ద్రాక్షారామ శాసనము సౌ. ఇ VII 1317).

పై వానిని పరిశీలింపగా తొలుతటి దానిలో పుణ్య తిథికి ముందునను, రెండవదానిలో దేశభాగమునకు ముందుగను, తరువాతి దానిలో శ్రీకారపు ముందునను 'శ్రాహి' (శ్రహి) పదము కన్పడు చున్నది. అన్నింటను పరిపాలన వత్సరపు సంఖ్యకు తరువాతనే అది కలదు. ఈ అన్ని సందర్భములకు పై పరిష్కర్తల అర్థములు ఏవియు సరి కుదురవనుట సుస్పష్టము కావున వేరుగ అర్థమును వెదకవలసి యున్నది.

పరిపాలన వత్సరమునకు తరువాతనే సదా ఈయబడుట వలన, సందర్భమును బట్టి, 'మొదలై జరుగుచుండగ', లేదా 'వర్త మానాబ్దము కాగా' అను అర్థము మాత్రమే శాసన పాఠములందు అన్నింట సరికుదురుచున్నది. దీనిని బలపరచు వేరొక అంశమును కలదు గుజరాత్ చాళుక్యులకు పారసీకులతో నెయ్యముననో-కయ్యము ననో సాన్నిహిత్యము ఉండెడిది. పారసీక భాషాపదములు ఆ కాలమున పశ్చిమ భారతమున, తద్వారా వ్యాపించినవి. అట్టి పదములలో 'శురుహ్' అనుదాని వికృతియే 'శ్రాహి' కావచ్చును. 'శురుహ్' అను దానికి మొదలిడుట, అని పారశీకభాషలో అర్థము. ఈ విషయమింకను పరిశీలింపవలసినదే అయినను 'శ్రాహి' = వర్తమానాబ్దము అనునదియే శాసన పాఠములకు అన్నింటికి సరికుదురునది.

**శ్రీ ఉత్పత్తి పిడుగు :** బౌద్ధాలయములను 6-7 శతాబ్దులలోఆంధ్ర దేశమున ధ్వంసము చేసిన కాలాముఖ శైవులు పెట్టుకొనిన బిరుద నామము. దుష్పథగాముల విధ్వంసకుడు అని ఈ పదపు అర్థము.

ఆంధ్రదేశమున పలుతావులందును, మహారాష్ట్రమున నాందేడ్ జిల్లాయందలి భోవర్ధన్ గుహాయందును ఆరు, ఏడు శతాబ్దాల తెలుగు-కన్నడ లిపిలో కననగు ఒక శాసన లేఖనము. ఆంధ్రదేశమున విజయవాడ, ఉండవల్లి గుహలలోను, కర్నూలుజిల్లా పాతకోటలోని నాగేశ్వరాలయముననను, సాతానికోటలో చెల్లాచెదురుగ ఒక పొలములో పడియుండు రాళ్ళలో ఒకదానిపైనను, మహానందిలోని రామాలయము నను, ప్రకాశం జిల్లాలోని సత్యవోలున ఒక ఆలయముననను, మహబూబ్ నగర్ జిల్లాలోని అలంపూరున చండికాలయమందలి స్తంభముననను, ఉంద్రుకొండలోని చెన్నకేశ్వరాలయపు ధ్వజస్తంభము పైనను ఇదే లేఖనము అదే లిపిలో కానవచ్చుచున్నది. నెల్లూరు జిల్లాలోని భైరవుని కొండలోని ఒక ఆలయముననను కలదని ఒక ప్రసిద్ధ రచయిత అనెను వరంగల్ జిల్లాలో పాండవుల గుట్టయందలి ఒక గుహపైనను ఈ లేఖ నము కలదని ఈ నడుమ తెలియవచ్చినది. దాని వివరములు ఇంకను తెలియరాలేదు.

వీనిలో కొన్నింట ఈ లేఖనము ఒకే ఒకటి కనరాగా, కొన్నింట దాని దిగువన కొన్నింట ఒకటియో, రెండో, మూడో పంక్తుల లేఖనములు కనవచ్చినవి అట్టి వానిలో ఎక్కువ పంక్తులు కలది సాతానికోట యంద లిది. అది ఇపుడు శ్రీశైలం ప్రాజెక్టు ముంపులో కనబడకుండపోయినది. అయినను ఈ శాసన ప్రతిబింబము ఆంధ్రప్రదేశ్ పురాతత్త్వ శాఖ వారిచే గ్రహింపబడి, శాసన పాఠము ప్రచురితమైనది.

పై వానిలో విజయవాడ, సత్తెనవోలు, ఉంద్రుకొండ, పాత కోటలలోని లేఖనములను అనుసరించి ఒక ఆయుధపు, ఒక వృత్తపు రేఖాచిత్రములు కనవచ్చినవి

పై లేఖనమునకును, రేఖాచిత్రములకును అర్థమును వివరించుటకు కొందరు పరిశోధకులు ప్రయత్నించిరి వీరందరికి 'ఉత్పత్తి పిడుగు' అనునది కొరకరాని కొయ్య అయినది చివరకు ఏదియును తోచక దానిని ఒక శిల్పి సంఘపు పేరుగను, ఆ రేఖాచిత్రములను వారి లాంఛ నముగను చెప్పి ఊరకుండిరి 'ఉత్పత్తిపిడుగు' అనుదానికి 'శిల్పి దక్షుడు' అను అర్థమును వారు కల్పింప యత్నించిరి. కాని అది ఒక అర్థరహితపు కృషి.

'ఉత్పత్తి' అను దానికి 'శిల్ప నిర్మాణము' అను అర్థము ఏనాడును ఎవ్వరును ఇచ్చి యుండలేదు ఇక పిడుగు అనునది వినాశము చేయుదానికే ఏ భాషయందైనను ప్రయుక్తము అందువలన వ్యాకరణ రీత్యా గాని, నిఘంటువుల రీత్యా గాని "శిల్పదక్షత" అనునది అచట ఏ విధముగను సరి కుదురదు.

నిఘంటు రీత్యా 'ఉత్పత్తి' అను దాని అర్థము 'చెడ్డ మార్గము'. 'ఉత్' అను సంస్కృత ఉపసర్గకు 'పెడబట్టిన' అను అర్థము కలదు తిక్కనామాత్యుడు 'ఉత్పథ' అను పదమును 'చెడ్డమార్గము'ను తెలుపుటకై వాడెను. ఇక 'పిడుగు' అన 'నిర్మూలించునది' అని తెలుపుటకు కావ్యములందే గాక, శాసనములందును ప్రయోగములు కోకొల్లలు. కావున 'ఉత్పత్తిపిడుగు' అనగా 'చెడ్డ మార్గమున నడచు వారిని నశింప జేయువాడు' అని అర్థము ఆరవ శతాబ్ది ప్రాంతమున బౌద్ధ మందలి మహాయాన శాఖ వజ్రయాన సిద్ధాంతముగ మారి నీతిబాహ్య మైనది అట్టియెడ ప్రజాసామాన్యపు సాహాయ్యముతో బౌద్ధ ఆలయములను, గుహారామములను ధ్వంసము చేసిన కాలాముఖ శైవులలో ప్రముఖులు తమ బిరుదుగ వాడుకొనినదే 'శ్రీ ఉత్పత్తి పిడుగు' అను పదము. ఈ వాదమును బలపరుచుచున్నది సాతానికోట యందలి ఈ దిగువ శాసనము

'స్వస్తి
శ్రీ ఉత్పత్తి పిడుగు
ఏకాన్తవాసి లోకశిలాభిమాన
శ్రీ అర్జునన్ మాహేశ్వర కాలాముఖ '

'లోకశిలాభిమాన' అనునది 'లోకశీలాభిమాన' అను దానిని చదువుటలో వచ్చిన పొరపాటు. కానిచో 'లోకశిల' అను దానికి అర్థమే లేదు లోక శీలమును అభిమానించి కాలాముఖు డగు అర్జున మాహేశ్వరుడు ఆ పనిని సాగించి శ్రీ ఉత్పత్తి పిడుగాయె నని దాని భావము.

ఇక లేఖనముల ప్రక్కన కొన్ని తావులలో కన్పట్టినది కాలాముఖులు పట్టుకొను లకుటము, దాని సమీపము నందలి వృత్తము మహాయాన ప్రతిపాదిత మగు శూన్య వాదమును తెలియజేయును.

# 2. తెలుగుదేశముపై సుమేరు సంస్కృతి ప్రభావము

—రాంభట్ల కృష్ణమూర్తి

[చిన్న మనవి : తెలుగు ద్రావిడ కూటానికి చెందిన భాష అని ఆధునిక పండితుల నమ్మకం. ఈ నమ్మకానికి మూలం కాల్డువెల్ బిషప్పు గారి సిద్ధాంతం. అయినా అది నేటికీ సర్వసమ్మతం కాలేక పోతోంది. సంస్కృత, పాళీ, పైశాచీ జన్యవాదాలు పుడుతూనే వున్నాయి. అది ఈ దేశానిదే కాదు, మెసపొటేమియాకు చెందిన సుమేరు అసుర భాషాజన్యం అన్నాడు జెకొస్లొవేకియా పండితుడు బెడ్రిక్ హ్రోజ్నీ. ఆయన సప్తతి పూర్తి అభినందన సంచిక 1949లో వెలువడింది. అందులో వుంది ఈ వాదం. ఆ వాదం నిజమే అని పించింది. నాటినుంచి మెసపొటేమియాను గురించి తెలుసుకోవాలన్న ఆసక్తి పుట్టింది.

మెసపొటేమియా మానవ చరిత్రకు తెలిసిన తొలి నాగరికతకు పుట్టిల్లు. శ్వేత పీత కృష్ణవర్ణాలవారికి నట్టిల్లు. సింధు నాగరికతకు మెట్టినిల్లు. హ్రోజ్నీ "పశ్చిమాసియా ఇండియా క్రెటేల ప్రాచీన చరిత్ర" అన్న పుస్తకం రాశాడు. అది ప్రాగ్ ప్రచురణ. ఐ. యం. దియకొనేవ్ సంపాదకత్వాన "ప్రాచీన మెసపొటేమియా" అన్న పేరున పరిశోధక పత్రాల సంపుటం వచ్చింది. అది మాస్కో ప్రచురణ. సుమేరు భాషా సాహిత్యాలమీద ప్రామాణికతను ఆర్జించిన శామ్యూల్ నోవాక్రామర్ అన్న పండితుడు "సుమేరులు" అన్న పుస్తకం రాశాడు. ఓపన్ హీం అన్న ప్రసిద్ధ పరిశోధకుడు 'ప్రాచీన

మెసపొటేమియా' అన్న పుస్తకం రాశాడు. ఎడ్వర్డ్ చియరు అన్న పరిశోధక పండితుడు "మట్టి పిడకల మీద రాత" అన్న పుస్తకం రాశాడు. జొవాన్ ఓటిస్ అన్న పరిశోధకురాలు "బాబిలన్" అన్న ఉద్గ్రంథం రాసింది. అలగ్జాండర్ హెయిడెల్ అన్న పండితుడు గిల్గమేశ పురాణం, బాబిలన్ సృష్టిగాథ అన్న కావ్యాలను అనువదించాడు. ఇవన్నీ అమెరికా ప్రచురణలు.

గత శతాబ్దంలోనే హెయిన్రిక్ ష్లీక్మన్ అన్న పరిశోధకుడు టర్కీ, క్రెటే, గ్రీసుల్లో తవ్వకాలు జరిపి సంచలనం సృష్టించాడు. ఆయన పురాశాస్త్ర పితామహుడు. ఇల్లియడ్ చారిత్రకతకోసం ఆయన ఈ తవ్వకాలు చేశాడు. చరిత్ర దొరకలేదు కాని దాంతో పశ్చిమ పండితుల దృక్పథంలో మాత్రం గొప్ప మార్పు వచ్చింది. "మైకేల్ వుడ్" అన్న విద్వన్యువకుడు ష్లీక్మన్ పరిశోధనలను వివరిస్తూ "ఇన్ సెర్చ్ ఆఫ్ ట్రోజన్ వార్" అన్న పుస్తకం రాశాడు. ఇది ఇంగ్లీషు ప్రచురణ. ఈ పుస్తకాలన్నీ చదవగల అవకాశం నాకు దొరికింది.

మెసపొటేమియా భాషా సంస్కృతుల ప్రభావం తెలుగు, కన్నడ, తమిళ, మలయాళీ భాషల మీదే కాక వేదవాఙ్మయం మీద కూడా గాఢంగా పడింది. ఈశాన్య వాయవ్య మధ్య భారతాలమీద కూడా కనిపిస్తుంది. ఏ లక్ష్యమూ లేకుండా పుస్తకాలు చదివే నా అలవాటుకు షష్టిపూర్తి అయింది. అందువల్ల ఫలానా అంశం యే పుస్తకంలోది అని ఎవరైనా అడిగితే ఏం చెప్పగలను? నేను భాషా పండితుణ్ణికాను, చరిత్ర పరిశోధకుడినీకాను. కాగా పరిశోధకులకు, పండితులకు ఈ నా వ్యాసంతో లక్ష్మణస్వామి చెప్పినట్లు "అగ్రతస్తే గమిష్యామి పంధాను మనుదర్శయన్." అంతే.]

మనది తెలుగుభాష. ఈ బాషకు కూకట్లు ఎక్కడున్నాయి? సంస్కృతంలో వున్నాయని కొందరంటున్నారు. కాదు, ప్రాకృతంలో వున్నాయని

మరి కొందరంటున్నారు. అసలు సంస్కృతమంటే యేమిటి? ప్రాకృతమంటే యేమిటి? పూర్వ రాజనీతివేత్తల పరిభాషలో "ప్రకృతులు" అంటే విద్యా గంధం, శాస్త్రజ్ఞానం లేని సామాన్య జనం అలాంటి వారు మాట్లాడే భాష ప్రాకృతం అనురూప ప్రాకృతాలను సంస్కరించుకున్న పండిత భాష సంస్కృతం. అంటే సంస్కృతం గ్రాంథికం అయితే ప్రాకృతం వ్యవహారిక భాష అన్నమాట. మరి తెలుగు కూకట్లు ఎక్కడ వున్నట్లు? తమిళంలో - తమిళంలో ఉన్నాయంటున్నారు ఆధునిక పండితులు. తమిళాన్ని సంస్కృతంలో "ద్రావిడ" అంటారు. మరి ఆ ద్రావిడ ప్రాకృతంలోనా, ద్రావిడ సంస్కృతంలోనా? తెలుగు కూకట్లు ఎక్కడున్నాయి? ఈ ప్రశ్నలకు జవాబు పుట్టదు. అందువల్ల నచశంకా నచోత్తరం

ప్రకృతులు అంటే సామాన్య జనం స్థాణువులు కారు. నిరంతర చలన శీలురు వారి భాషకూడా పరిణామ శీలం ప్రవాహశీలమైన భాషలకు ఏనాడో గోడలు కట్టి పెట్టిన పేర్లు నేటికీ పనికి వస్తాయా? భాషా సంస్కృతులు ఎంత ప్రవాహశీలాలైనా వాటిలో స్థిర అంశాలు కొన్ని వుంటాయి ఈ వాస్తవాన్ని గుర్తుంచుకుని మన కూకట్లను పట్టుకొనడంకోసం కాలాన్ని తవ్వుకుంటూ గతానికి పయనించవలసి వుంటుంది పురావశేషాలు మన ప్రయాణానికి దిక్సూచికలు.

స్థల జల గర్భాలను గాలిస్తే పురావశేషాలు దొరుకుతాయి. అయితే అవి పార్థివ సంస్కృతి అవశేషాలు మాత్రమే అవి సంస్కృతిశరీరం లాంటివి భాష, వాంగ్మయం పార్థివం కాదు చేతన సంస్కృతి. స్పిరిట్యువల్ కల్చరు ఆ సంస్కృతి నిక్షేపాలు సాహిత్యం, సమాజం, భాష - ఇవి మాత్రమే అందువల్ల స్థల జల గర్భాలనేకాక భాషాసాహిత్య సమాజ గర్భాలను కూడా శోధించినప్పుడే చరిత్రకు కావలసిన దేహాత్మలు రెండూ దొరుకుతాయి. సమాజం ఎంత పరిణామశీలం అయినా స్థలనామాలు, దేవుళ్ళ పేర్లు, అర్చన విధానాలు. పండుగలు పబ్బాలు, రాగద్వేషాలు-వీటికి సాపేక్ష స్థిరత వుంటుంది చరిత్ర పరిశోధకులందరికీ యిది అనుభవైకవేద్యం.

సురవరం ప్రతాపరెడ్డి గారు "రెడ్డి" పదం కూకట్లు వెతుకుతూ బయలుదేరి రాజస్థాను వరకూ వెళ్ళారు. రెడ్డి, రడ్డి, రట్టడి, రారోడ్ దాకా సాధించారు.

నాటికి లభ్యమైన చరిత్రకాధారాలు అంతే మరి, రాజస్థానీ కోట గవనులను "ప్రోలు-పోలు" అంటారు భారతకాలాన గాంధారంలో అరట్టగణాలుండేవి. తెలుగుపేర్లు అయిన 'ఊరు, ఆల' సింధు, పంజాబు, గాంధారాల వరకూ కనిపిస్తాయి

కొత్త పరిశోధనలు చరిత్రను కొత్త మలుపు తిప్పుతున్నాయి. సర్ మోర్టిమర్ వీలరు తవ్వి తీసిన "సింధు" నాగరికత వల్ల మన దేశచరిత్ర అయిదారువేల సంవత్సరాల వెనక్కు వెళ్ళింది సింధునాగరికత మెసపొటేమియా నుంచి వచ్చి వుంటుందని పండితులు అనుమానిస్తున్నారు. అక్కడ దొరికిన సీళ్ళను ఇంతవరకూ ఎవరూ చదవలేదు. లిపి-భాష-ఈ రెండింటిలో ఒకటి తెలిస్తే రెండోదాన్ని సాధించవచ్చును. భారతీయ వేదవాంగ్మయ మాహాత్మ్యం వల్ల సింధునాగరికులది కూడా "ఆర్య" భాషే అయివుంటుందన్న భ్రమలో పడ్డారు పండితులు హిట్టయిట్ క్రెటే భాషలను కూడా చదవగలిగిన "బెడ్రిక్ హ్రోజ్నీ" అన్న పరిశోధకుడు కూడా అదే భ్రమలో పడ్డాడు కాని దక్షిణాది భాషలను మాత్రం ద్రావిడ భాషలని పిలవడం అసంగతమన్నాడు. వాటిని సుమేరో అసీరియన్ భాషలనాలన్నాడు రష్యన్ శాస్త్రవేత్తలు కొందరు కూడా ఆయనతో ఏకీభవించారు ఏమయినా సింధు నాగరికత సుమేరో అసీరియను నాగరికత అయివుంటుందన్న అనుమానం వారికి కలగలేదు.

మానవ చరిత్ర పురాజీవశాస్త్రం లాంటిది ఒకింత నిర్ధారణాంధత్వంవల్ల మహా మేధావులు కూడా కంటిముందున్న దాన్ని కానలేరు అంటాడు కారల్ మార్క్స్, నిజమే. సింధునాగరికత సుమేరు అసుర సంస్కృతి అని స్పష్టంగా కంటిముందు కనిపిస్తూ వున్నా "నిర్ధారణాంధత్వం" వల్ల మహా పండితులు ఆ సంగతి కానలేకపోతున్నారు.

ఈ దేశానికి తొలుత జంబూద్వీపం అని పేరు ఆ పేరునిప్పటికీ స్మరిస్తూనే వున్నాం. తరవాత అజనాభం అనే పేరు వచ్చింది ఆ పేరుకంత ప్రచారం రాలేదు. ఆ తరవాత ఈ దేశాన్ని భరతఖండం అన్నారు. ఖండం అంటే నేటి "కాంటినెంటు" అని అర్థంకాదు. కాంటినెంటును మనవారు "వర్షం" అన్నారు. ఆ భరతవర్షం ఏదయివుంటుంది? జంబూద్వీపం, భరతఖండాలన్న పేర్లు ఏ చారిత్రక దశలో వచ్చాయి?

ఈ ప్రశ్నలకు పరిశోధకులు జవాబులు వెతకవలసివుంది. సింధు నాగరికత ఈ దేశాన వేద నాగరికతకన్న ముందే పుట్టి పెరిగింది. వైదికార్యులు ఈ సింధునాగరికులతో పోరు చేశారు వాటి వివరాలు వేదాల్లోనూ మన పురాణాల్లోనూ కనిపిస్తాయి పురాణాల్లోని "త్రిపురదాహ" గాధ సింధులోని "మొహంజొదడో" విధ్వంసగాథే. సింధీభాషలో మొహంజొదడో అంటే దెయ్యాలదిబ్బ అని అర్థం అంటే ఆ నగర విధ్వంసం తరవాత దాని పునర్నిర్మాణయత్నాల కూ్కడా అవరోధాలేర్పడ్డాయన్న మాట పురాణాలు చరిత్రలు కావు. కాని అవి చారిత్రక సత్యాలను ప్రతిఫలిస్తాయంటాడు మార్క్స్. చరిత్ర అంటే మానవ చరిత్ర అని అయన మతం.

నేటి ఇరాకు తూర్పు భాగాన య్యూఫ్రెటిస్, టైగ్రస్ అన్న రెండు జీవ నదులు ప్రవహిస్తున్నాయి. వాటిని పూర్వం "బురున్నం, తిగ్లత్" అనేవారు. సంస్కృత భాషలో అవి "వరుణ - తిగృథ" అవుతాయి ఆ నదుల మధ్యనున్న 'లంక' చరిత్రకు తెలిసిన తొలి నాగరికతకు పుట్టినిల్లు గ్రీకులు ఆ ప్రాంతాన్ని "మెసపొటేమియా" అన్నారు అంటే రెండు జలాల మధ్యనున్న భూమి అని అర్థం. సంస్కృతంలో అలాంటి భూమిని "ద్వీపం" అంటారు. పారసీకులు దోఆబ - ద్వి-అప అంటారు మనం లంక అంటాం ఆ లంకలో తొలి నాగరికతను నిర్మించిన వారిని చరిత్రకారులు 'సుమేరు'లన్నారు. నగరం దేవాయతనాల నిర్మాణం, అర్చన విధానం, దేవాదాయ నిర్వహణ, రాజ్యతంత్రం, లిపి, గ్రంథ రచన, పాఠశాల, కళాశాలలు, గ్రంథాలయాలు, గణితఖగోళశాస్త్రిలు, వైద్యం-ఇలాగ సుమారు ఇరవై అంశాలకు వరవడి పెట్టిన ఘనత సుమేరులది.

క్రీస్తు పూర్వం ఆరో సహస్రాబ్ది నుంచి మూడో సహస్రాబ్ది వరకు లంకలో సుమేరుల ప్రభ వెలిగింది. ఆ తరవాత అగద, అసుర, మరుత్త, మైతాణి, మేథ, కుశ, పారసీక, గ్రీకులు అక్కడ రాజ్యాలు చేశారు. సుమేరుల కాలాన పశ్చిమ ఈరానులో "ఈలం" ఈశాన్య ఈరానులో "అరట్ట" రాజ్యాలుండేవి. ఈలం సుమేరుల మధ్య ఆదినుంచీ దౌర్హార్దం, అరట్టతో సౌహార్దం వుండేవి. ఇవికాక క్షత్ర, సిరియా, మగన్ (ఈజిప్టు), మొహ (సూడన్) దిల్మన్ (ఇండియా) దేశాలతో సంబంధాలుండేవి లంక సారవంతమే అయినా

పడమర భాగం అంతా ఎడారి భూమి చదును రాళ్ళు కొండలు లేవు. కొయ్య నిచ్చే అడవులు లేవు. నదులు మోసుకుని వచ్చే ఒండ్రు మాత్రం పుష్కలం నదుల ఒడ్డున చిత్తడి నేలల్లోను తుంగ, జమ్ము, కుశ లాంటి గడ్డి బాగా మొలిచేది ఈ గడ్డి, ఒండ్రూ ఇవి వారి నాగరికతకు మూలాలయ్యాయి.

సుమేరులన్నది ఇతరులు పెట్టిన పేరు. ఒండ్రు మట్టితో ఇటికలు చేసి గోపురాలతో ముందు దేవాలయాన్ని నిర్మించేవారు గుడి గోపురాన్ని "మేరువు" అనేవారు అందువల్లనే వారికి సుమేరులని పేరు వచ్చి వుంటుంది మేరు నిర్మాణం చేతనయిన మరొకజాతి కూడా వుండేది అది ఈజిప్టుకు దక్షిణాన వున్న సూడన్ వారికి రాళ్ళు పుష్కలం వారికీ దేవాలయ నిర్మాణం తెలుసు వారిని "మేరు" లనేవారు లంకమేరులను సుమేరులనేవారు. ఈజిప్టు వారు మేరులనుంచె పిరమిడు నిర్మాణాన్ని నేర్చుకున్నారు పిరమిడు అన్నది గ్రీకు మాట ఈజిప్షియనులు ఆ పిరమిడ్లను మేరువులనే పిలిచేవారు వారు రాతను కూడా సుమేరుల నుంచే నేర్చుకున్నారంటారు చరిత్రకారులు. మేరు స్వరూపాన్ని మాటతో సహా మనవారు స్వీకరించారు. మేరువుమీద దేవతలుంటారన్నది సుమేరు భావన దాన్ని మనవారు, గ్రీకులు కూడా తీసుకున్నారు గ్రీకు దేవతలు ఒలింపస్ పర్వత శిఖరాన అంటే మేరువున వుంటారు

సుమేరులు తమ భూమిని "ఎంగి" అని పిలుచుకున్నారు. తమవారిని "ఎంగిర్లు" అన్నారు సుమేరు భాషలో "లు" అంటే మనిషి బహువచన ప్రత్యయం కూడా. ఎంగిర్లు అన్నమాట తొలివేదరుషులైన అంగిర్లులా ధ్వనిస్తోంది అంగిర్లు కూడా నిప్పును చేయడం కనిపెట్టి నాగరికతకు మునుము పెట్టారు. తమ దేవతకు ముందు గుడికట్టేవారు ఎంగిర్లు గుడికి "అగం" అని పేరు. తమ స్వాధీనాన ఉన్న భూమిలో ముందు గుడిమాన్యాలను వేరుచేసి మిగిలిన భూములను తమ గణ గృహపతులకు పంచేవారు. ఇలా పంచిన భూములకు "పురం" అంటే పురభూములని పేరు పుర అంటే సుమారు అరవై మూడు హెక్టేర్లు, ఆ కొలతకుకూడా పురమనే పేరు గుడి పరిపాలనా వ్యవహారాలను చూసే పెద్దకు 'ఎన్సీ' అని పేరు సాగునీటి వనరులను కల్పించేవాడు అని ఆ మాటకు అర్థం. మన దొర అన్నమాటకు కూడా అదే అర్థం

దేవాలయ అర్చకులకు "సంగ" అని పేరు ప్రధానార్చకుడు ద్రష్ట అయివుండేవాడు. అతడిని బరుసంగ అనేవారు. సంగుల్లో సుమారు ముప్పయి రకాలవారుండేవారు అందరికన్నా కిందివాడు అంత్యక్రియలు చేయించే సంగ. ఇలాంటి అర్చక వ్యవస్థ యిప్పటికీ అంబలవాసీలన్న పేరుతో కేరళలో కనిపిస్తుంది. సంగులు, పురాలు పొందిన గణముఖ్యులు, వేతివృత్తులవారు, శాస్త్ర వేత్తలు విద్వాంసులు ఇతర దేవాలయ పాలకులు అంతా గుడి పరిసరాల్లోనే ఇళ్ళు కట్టుకుని నివసించేవారు అలా పెరిగిన నగరానికి "ఊరు" అని పేరు, పురం భూములను సాగుచేసేవారు కొన్ని పురాలకు కలిపి వాటి సరసనే పల్లెలు కట్టుకునేవారు

అలాంటి పల్లెలకు "ఆల" అని పేరు అల, ఆలు అంటే బానిస అని తరవాతి కాలాన అర్థం వచ్చింది. దక్షిణాది బాషల్లో కూడా ఆ మాటకు అదే అర్థం మనం వాడే "ఇల్లాలు" అన్న మాటకు కూడా క్రియలో అదేకద అర్థం! కన్నడదేశాన నేటికీ పుట్టాలు, మన్నాలు అన్న కులాలున్నాయి. పుట్టాలు అంటే పుట్టు బానిస, గర్భదాసుడు మన్నాలు అంటే సాగుభూమికి అనుబంధంగా వున్న బానిస, ఇంగ్లీషు సెర్ఫ్‌లాంటివాడు. ఎంగిర్లు కొండను, మెరకను 'కుర్రు" అనేవారు. నీటి సరసనున్న భూమినీ, పల్లాన్ని "తుర్రు" అనేవారు. ఊరు, ఆల, కుర్రు, తుర్రు అన్న గ్రామనామాలు తెలుగునాడంతటా కనిపిస్తాయి. అంతే కాదు కుర్రు, తుర్రు వేదాలకూ్కడా ఎక్కాయి. కొండభూముల్ని కురుభూము లన్నారు. తుర్రుభూములను "తుర్వసు" అన్నారు అగం ప్రాంతాన పుర భూములు గల గృహపతులుండేవారు కదా! అరవంలో గృహపతిని నేటికీ "అగముడయన్" అని పిలుస్తారు ఆ పేరుగల వ్యవసాయదారుల కులంకూడా తమిళనాడులో వుంది. తమిళ సాహిత్యంలో "అగం, పురం" అన్న రెండు విభాగాలున్నాయి అగం అంటే దివ్యసాహిత్యం అని, పురం అంటే లౌకిక సాహిత్యం అని పండితులంటున్నారు; కాని ఆ మాటల అసలు అర్థం వారేనాడో మరచిపోయారు. ఈ అగంనుంచే ఆగమశాస్త్రం అన్నమాట పుట్టింది.

రాత, దివ్య-లౌకిక సాహిత్య నిర్మాణం విద్యాలయాలు గ్రంథాలయాలు అన్నీ సంగులు ఆధ్వర్యాన నడిచేవి. అరవ్వారు చెప్పకునే "సంగం" సాహిత్యం ఈ సంగులకు సంబంధించినదే కాని మహాప్రాణాక్షరాలెరుగని

పండితులు చెప్పే "సంఘం" మాత్రం కాదు బసవేశ్వరునికి శివదీక్ష యిచ్చిన సంగమయ్య ఇలాంటి సంగుడే కాని పండితులు పునరుక్తి చేసిన కూడలి సంగమయ్య కాదు బరుసంగులు సుమేరుద్రష్టలే కాదు, వేద మంత్ర ద్రష్టల్లో కూడా ఒక అరడజను మందికి "బరు" అన్న బిరుదం కనిపిస్తుంది. ఈ బరు అన్నమాటే పారు-బారు అన్న రూపంలో తెలుగు, కన్నడాల్లో కనిపిస్తుంది. అగం అంటే దివ్యస్థలం కదా? ఆ మాటకు దివ్యత్వార్థం వుండవచ్చును తెలుగున అగ, అగ్గ, అంటే శ్లాఘ అన్న అర్థం వుంది. అగ్గించు అంటే శ్లాఘించు అని అర్థం తెలుగున అగ్గన్న, అగ్గమ్మ అన్న పేర్లున్నాయి అవి అగ్నిసంభవం అని పండితులు వాదిస్తారు "కడ" అంటే పన్ను, "కరం" "అగ్గడ" అంటే ప్రశంసనీయంగా పన్ను వసూలు చేసేవాడని అర్థం వస్తుంది అక్షపటలాధికారిని అగ్గడ అనేవారు అలాంటివారి అధిపతి పేర్-అగ్గడ - ప్రెగ్గడ పేర్ అంటే పెద్ద

ఎంగిర్ల తరవాత క్రీస్తు పూర్వం ఇరవై మూడో శతాబ్దంలో 'అగదులు' రాజ్యానికి వచ్చారు ఈ అగదులు అసురులు అప్పటికి "అస్సూరు" నగరం లేదు. అగద సామ్రాజ్య స్థాపకుని పేరు "సర్రుకిన్" ఇతడి జన్మకూడా మన కర్ణునిలాంటిదే అందువల్ల ఈయన "సుక్షత్రియు"డన్న అర్థం వచ్చే సర్రుకిన్ అని పేరు పెట్టుకున్నాడు ఈయన నిర్మించుకున్న ఊరుపేరు "అగద" దాని ఆనవాలిప్పుడు కానరావడం లేదు. వీరిని బైబిలు "అక్కడు" లంది ఆ పేరుమీదే మనకు అక్కన్న, అక్కయ్య అన్న పేర్లు నేటికీ నిలిచాయి ఆయన సిబ్బంది అంతా అగ్గడులు ఆయన పంక్తిని పూటకు ఆరు వందల మందికి దేవేరి వడ్డన చేయించేది వీరిది సుమేరు, అసుర కలగలుపు భాష. అది సెమెటిక భాషకు దగ్గర అని పండితుల వాదం

మానవేతిహాసవేత్తలు మాతృస్వామిక పితృస్వామిక సమాజాలు గిరి గీసినట్లు ఉంటాయని వర్ణిస్తూ వుంటారు అలాంటి లక్షణాలున్నమాట నిజమే కావచ్చును కాని సర్రుకిన్ పెత్తనం పేటలోనే కాని, కోటలో మహారాణిదే పెత్తనం లంకలోని నాటి సమాజాన్ని పరిశీలించి చూస్తే స్త్రీ పురుష విభేదాలు పని విభజనలో మాత్రమే కాని హక్కులు, ఆస్తి విభజనలో మాత్రం కాదని విదితం అవుతుంది. అలాంటి అసుర సమాజ లక్షణాలు దక్షిణ రాష్ట్రాల్లో

కనిపిస్తాయి దక్షిణాది సమాజాన్ని జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఆ సంగతి బోధపడుతుంది పండితులది పున్నమి, అమావాస్య మన తత్వం. రెండింటికీ నడుమ ఎన్నో తిథులున్నాయన్న సంగతి గమనించరు అసుర, అగద భాషలు సెమెటిక్ భాషలని పండితుల మతం కాని సెమెటికు ఆర్యసంస్కృతుల మేలికల గలుపు అసుర, అగద సంస్కృతి అని వారు గుర్తించలేదు. దయ లెక్కిక్కు ఎరగని మతం వారిది ఏంచేస్తాం మరి!

ఎంగిర్ల కాలంలోనే భాష సంస్కృత ప్రాకృతాలుగా వుండేది. భాషను వారు "ఏమ" అనేవారు సంగుల సంస్కృత భాషకు "ఏమతుష" అని పేరు. తుష అంటే అర్థం తెలీదు కాని మన "తుషిత" కు సరిపోయేట్లు కనిపిస్తుంది. ముప్పయి ఆరుగురున్న దేవగణాన్ని తుషితు లంటారు. బౌద్ధులు "తుషిత" స్వర్గాన్ని ప్రత్యేకంగా పేర్కొంటారు దీన్నిబట్టి ఏమతుష అంటే దేవభాష అని అర్థం చెప్పవచ్చును సామాన్య జనుల షాకృత భాషకు "ఏమసల" అని పేరు. సల అన్న మాటక్కూడ అర్థం తెలీదు. కాని హలంతంగా వుండే తుష భాష "సల"లో అజంతత్వాన్ని సవరించుకుంది ఏమసల అంటే సంగీత భాష అని అర్థం చెప్పారు పండితులు అజంతమైన మన తెలుగు కూడా సంగీత భాషేకద! అగ్గడుల కాలాన ఈ ప్రాకృతానికి రాజభాషాగౌరవం వచ్చింది ఏమ అన్న మాట మన తెలుగున అనవేమలోనూ వేమన్నలోను కనిపిస్తుంది.

ఎంగిర్ల తొలి దేవత పేరు 'అంకి' ఆ భాషలో 'అం' అంటే అకాశం 'కి' అంటే భూమి. అంకి అంటే ద్యావాపృథివి. వేదాల్లో తరుచుగా కనిపించే మాట అది వివాహ మంత్రాల్లో వరుడు "ద్యౌరహం పృథివీస్త్వం" అంటాడు అంటే నేను ఆకాశాన్ని నీవు భూమివి అని అర్థం కాళిదాసు "జగతఃపితరౌ వందే" అన్నది దీన్నే తెలుగునాట అంకి, అంకమ్మ, అంకినీడు, అంకాలమ్మ అన్న పేర్లెక్కువ. పంబలవాళ్లు అంకమ్మ కథలను పాడుతారు. మాలలకు అంకమ్మ పెద్దమ్మ, సుంకులమ్మ చిన్నమ్మ. తెలుగునాట మాలలు స్వయం సంపూర్ణ గణ లక్షణాన్ని నేటికీ కాపాడుకుంటున్నారు

కాలక్రమాన ఆకాశానికీ భూమికీ ప్రత్యేక దేవరలు ఏర్పడ్డారు ఆకాశ దేవర పేరు "అను" ఇతడు దేవరాజు. ఏ దేశ పురాణాల్లోనయినా ఆకాశ

దేవరే దేవతలందరికీ రాజు అను పేరు మీదే మనవారు అన్నయ్య అన్నమ్మ అనుగురాజు అనపోతు అనవేమ పేర్లు పెట్టుకున్నారు లంకలో ఊరుకు, ఉనుగు, అనుగు అన్న నగరం ఈ దేవర మూలస్థానం మన నందిలాంటి దేవ వృషభం ఈయన ఆధీనంలో వుండేది ఎంగిర్లు దాన్ని ఏమనేవారో తెలియదు కాని తెలుగువారు అనపోతు అని వుంటారనిపిస్తోంది

భూమి దేవర పేరు 'ఎంకి.' ఈయన మన వరుణుని లాంటివాడు వరుణుని లాగే ఈయనకీమూలస్థానం "అప్సు." మహాలయానికి ముందున్న తొలి నగరం ఎంకిదని చెబుతారు ఆ రోజుల్లో ఆ తొలి నగరం "ఊరిడు" సాగర సంగమం దగ్గరుండేది. ఇప్పుడా నగరం సముద్రానికి ఏభై మైళ్ల ఎగువనుంది అంటే వరుణ తిగ్రుధ నదులు ఆ మేరకు ఒండ్రు మట్టిని పేర్చాయన్నమాట ఎంగి దేశ సౌభాగ్య రహస్యం అది. 'ఎంకి' సకల సంస్కృతులకు జన్మదాత ఎంకిని సెమెటిక్కులు "ఇయ" అంటారు ఆ పేరు కూడా తెలుగునాట వియ్యన్న, వియ్యమ్మగా వుంది

ఎంకి మనవారి వెంకటేశ్వరుడుగా వెలిశాడని అనుకుంటున్నాను. వెంకటేశ్వరుని అరవలు తిరు వెంగడై ముడయన్ అంటారు అంటే శ్రీ వేంగినాథుడని అర్థం. వేంగిదేశాన్ని అరవలు వేంగాడు అనేవారు. ఎంకి వరుణునితో సమానం అనుకున్నాంకదా? వరుణుడు దేవతలందరిలో అతి ప్రాచీనుడు జగత్తుకు ఒక క్రమ పద్ధతిని ఏర్పరచి దాన్ని పాశబద్ధం చేశాడు. వరుణపాశం అనుల్లంఘనీయం. అలాగే ఎంకి కూడా జగద్వ్యవస్థను పాశబద్ధం చేశాడంటారు ఎంగిర్లు. వేదాల్లో వరుణునికి మాత్రమే రాజు అన్న బిరుదం వుంది. కొన్ని రుక్కుల్లో అతడిని "మహాసుర" అని కూడా సంబోధించారు అంటే ఆనాడు అసుర అన్నది గొప్పకు చిహ్నం అన్నమాట!

భూమ్యాకాశాల మధ్యనున్న వాయువు అవతారం "ఎన్లిల్" ఇతడు అను కుమారుడు. అను ఎంకిల శక్తులను తీసుకుని దేవరాజ్య పట్టాభిషిక్తుడయ్యాడు. ఇతడి మూలస్థానం నిప్పూరు. దేవాయతనం పేరు ఏకూరు దక్షిణాదిన అంటే తెలుగు కన్నడాల్లో "ఎల్లి" అయ్యాడు. వేదాల్లో ఇంద్రునికి సమానం. దక్షిణాదిన వైష్ణవులకు విష్ణువు, మధ్వలకు వాయువు, శైవులకు

శివస్థానం అయిన ఏకూరయ్య సామాన్యజనానికి ఎల్లి, ఎల్లమ్మ ఏకూరయ్యనే పండితులు ఏకోరామయ్యగా మార్చుకున్నారు

సర్గోకిన్ మనవడు నారంసిన్ నిప్పూరుమీద దండెత్తి ఏకూరును దోచుకున్నాడు. తానే దేవుడిననీ అర్చనలు తననే స్తోత్రం చేయాలనీ శాసించాడు. ఎంగిలో దైవత్వ చిహ్నం శృంగకిరీటం, దేవతలకు మాత్రమే ఆ కిరీటం వుండేది. నారంసిన్ తానే శృంగకిరీటం ధరించాడు. జనం నిస్సహాయులై ఉండిపోయారు మన పురాణాల్లో అసురులకు శృంగ కిరీటాలు తనకే పూజలు చేయాలన్న హుంకారాలు ఈ నారంసిన్ గాథలనుంచే పుట్టినట్లనిపిస్తుంది ఏమయినా "గూతు" లనే కొండవారు నారంసిన్‌మీద దాడిచెసి అతడి రాజధాని అగదను ధ్వంసం చేశారు. అంతటితో అగద వంశం అంతమయింది తరవాత ఎంగిర్లు పుంజుకున్నారు ఏకూరును పునర్నిర్మించుకున్నారు

ఎల్లి తరవాతి దేవుడు చంద్రుడు. ఎంగిర్లతడిని "నన్న" అన్నారు. అగదులు "సిన్" అన్నారు. సిన్ నుంచే చంద్రశబ్దం వచ్చిందన్న పండిత వాదం ఒకటి ఉంది. మనకు రెండు అమావాస్యలు, రెండు పున్నములు వున్నాయి ఒక కళవున్న అమావాస్యను "సినీవాలి" అంటారు ఈ మాటలో "సిన్" కనిపిస్తుంది. నిండు అమాసను "కుహూ" అంటారు అలాగే ఒక కళ తక్కువున్న పున్నమిని "అనుమతి" అంటారు ఈ మాటలో ఎంగిర్ల దేవరాజు 'అను' మనకు కనిపిస్తాడు నిండు పున్నమిని రాకా అంటారు. మన ఆదికవి నన్నయ, నన్ని, నన్నిచోడ పదాల్లో "నన్న" కనిపిస్తాడు తెలుగు ప్రాకృతాన సిన్ని సిన్నమ్మ సిన్నయ్యల్లో "సిన్" కనిపిస్తాడు ఈ సిన్న అల్పార్థకమైన చిన్న కాదు.

నన్నకు ఒక కొడుకు ఒక కూతురు. కొడుకు పేరు "ఉతు" సూర్యుడు. అగదులితడిని బబ్బర్ అన్నారు. తరవాతి అసురులు "షంశ్" అన్నారు. తొలి గ్రంథాల్లో 'అసుర' నామాలస్థానే మలిగ్రంథాల్లో 'శంశ' పేరును చేర్చారు అంటే అప్పటికి గ్రీకు హెలెనిస్టు సంస్కృతి వారిమీద పడిందన్న మాట! అరబ్బులిప్పటికీ సూర్యుడిని శంస్ అనే అంటారు. కూతురు పేరు "ఇనన్న". అసురులు ఈమెను ఇస్తారు, ఇస్టార్ అన్నారు ఇస్తారి అన్న పేరు తెలుగుల్లో కనిపిస్తుంది స్టార్ అంటే తార ఇనన్న అసుర దేవత, తొలి అసు

రులు ఆమెను "సుక్క" అన్నారు అనుకు మూలస్థానం అయిన ఉనుగు-ఆనుగు నగరమే ఈమె తొలి మూలస్థానం నిజానికి అను భార్య "నిన్ను" కాని ఆమెకు పూజాపురస్కారాలు లేవు ఎంగిర్లు అగదులు అసురులు మరుత్తులు అందరూ ఇనన్న నే రకరకాల పేర్లతో పూజించేవారు. మగన్ మలుహాలతో పాటు దిల్మున్ వజీరు కూడా "సుక్కలమ్మ" నుంచి ఈ అనుగుదేవికి ఉడుగరలు తెచ్చినట్లు కొన్ని పత్రాలు దొరికాయి. అంటే దిల్మున్‌లో సుక్కమ్మ అప్పటికే ప్రసిద్ధి కెక్కిందని దీనివల్ల తెలుస్తుంది దిల్మున్‌నే సంస్కృతంలో అజనాభం అన్నారు ఎంగిర్ల ప్రభ వెలిగినంతకాలం అదే పేరుండేది.

తృతీయ సహస్రాబ్దినాటికే ఈమె అసురుల కులదేవత అయింది ఉత్తర లంకలో వరుణానది ఒడ్డున 'మారి' అన్న నగరం వుంది. దాన్ని శంబరమాత అనే మహారాణి ఏలుతూ వుండేది ఆమె సెమీరామిస్ పేర గ్రీకు పురాణాలకు ఎక్కింది. ఆమె సుక్కదేవి పరమ భక్తురాలు దేవికి బంగారు విగ్రహం చేయించాలని సంకల్పించింది. ఇనన్న ప్రణయదేవత, సౌభాగ్య దేవత, ధనదేవత, యుద్ధదేవత, ప్రళయదేవత కూడా ఆమె పూజలనుంచే మన శాక్తతంత్రాలు, గ్రీకుల ఐలూషియన్ మిస్టరీలు పుట్టాయి దేవీ విగ్రహం తయారయేవరకు పెళ్ళిళ్ళు ప్రేమలను నిషేధించింది రాణి వేలాది పనివారు, బానిసలు నడుములు కట్టారు అమ్మవారి బంగారు విగ్రహం తయారయింది. దాని బరువు రెండువందల యాభై టన్నులని చరిత్రకారులు లెక్కలు కట్టారు. ఆనాటిదే "పెరామిస్ థిస్బీ" అన్న గ్రీకు పురాణగాథ. ఆ విషాద ప్రణయ గాథ మన తెలుగు ప్రాకృతంలోనూ వుంది. అదే కేదారగౌరీ గాథ ఈ గాథ నుంచే మన్మథునికి శంబరారి అన్న బిరుదం వచ్చింది జంబూద్వీపం అని మన దేశానికి పేరు వచ్చింది

అంతవరకూ తెల్లగా వుండే నేరేడు పళ్ళు కేదారగౌరుల నెత్తురు తాగి నలుపెక్కాయి. వేలాది బానిసలు తిరుగుబాటు చేసి, పైడితల్లి విగ్రహాన్ని చితక్కొట్టి ఏట్లో కలిపారు. గట్టునున్న అల్లోనేరెడు, ఏట్లో బంగారుటిసక-దీన్నుంచే బంగారానికి జాంబూనదం అన్న పేరు వచ్చింది. వేలాది బానిసలు శంబరులు నేరెడుకొమ్మ టెక్కెంగా ఈ దేశానికి వలస వచ్చారు. శంబరులు శాబరులు శబరులు జాంబువులు పేర వారిక్కడ స్థిరపడ్డారు. వారి వెంట సుమేరులు అంటే ఎంగిర్లు కూడా వచ్చినట్లు ఆధారాలున్నాయి ఉత్తరాంధ్రలో నేరెడుకొమ్మ లేనిదే నేటికీ పెళ్ళిళ్ళు జరగవు ఆ కొమ్మ చిరదాంపత్యచిహ్నం.

లంకలో రాయి దొరకదు కొయ్య దొరకదు లోహాలు లేవు. ఒంట్రడు మట్టిని మోసుకునివచ్చే రెండు నదులు మాత్రం వున్నాయి ఈ దేశాన అన్నీ పుష్కలమే మరి స్వర్గధామం అంటే ఇదే కద! దిల్మున్ అంటే స్వర్గం అని వారికి చిరకాలంగా తెలుసును అయినా జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి జన్మభూమిని విడిచిపెట్టడం తప్పనిసరి అయినపుడు స్వర్గాన్నే ఎన్నుకుంటారు ఎంగి మేధావులు ఆ పనే చేశారు ఎంగిర్లకు కావల సిన ఓడలను కొచ్చిన్ రేవులో కట్టేవారు ఆ ఓడల మీద తూర్పున జపాను దీవుల నుంచి ఎంగి వరకు వర్తకం సాగేదని ఇటీవలనే కొన్ని చారిత్రకాధా రాలు దొరికాయి తృతీయ సహస్రాబ్ది ఆదిలో "ఈతన" అనే ఒక రాజు "అనుగు" నగరాన్ని ఏలుతూ వుండేవాడు ఆతడికి "బలి" అన్న పేరు కూడా వుండేది వరుణానది ఉపనదుల్లో ఒక దానికి బలి అని పేరు ఈతనకీ ఆ నదికీ సంబంధం యేమిటో తెలియదు.

ఆయన చాలా ధర్మాతుడు జనప్రియుడని పేరు పొందాడు. ఒక సుముహూర్తాన ఆయన పరివారంతోసహా అదృశ్యుడయ్యాడు ఏమయ్యాడో తెలీదు. ఆయన దిల్మున్‌కి వెళ్ళిపోయాడని కొందరన్నారు కాదు పాతాళంలో చూశామని మరికొందరన్నారు ఆ రాతలు, ఈ రాతలు కూడా దొరికాయి. అంతకుముందు ఈ దేశానికి వచ్చినవారు సింధు, గుజరాతు, రాజస్థానులకు పరిమితమయ్యారు అందుక్కారణం లేకపోలేదు అక్కడి నేలలకు కూడా తమ లంక నేలల పోలికలున్నాయి అందువల్ల ఇది తమ జన్మభూమిని పోలి ఉన్నట్లుగానే వారికి తోచివుండవచ్చును లంక ఉత్తరాన తిగ్రిస్ తీరాన "అరప్ప" అన్న వూరుంది. ఏ కారణం వల్లనో జనం ఆ వూరును హఠాత్తుగా ఖాళీ చేసినట్లు చరిత్రకారులు కనుగొన్నారు వారూ వలస వచ్చి వుండవచ్చును ఈ దేశాన పంజాబులో తమ నూత్న మాతృ స్థానాన్ని అదే పేరుతో నిర్మించు కున్నారు.

మారి నుంచి వచ్చిన శంబరులు సింధులో తమ దేవత పేర సుక్కూరు నిర్మించుకుని వుంటారు. సుక్కూరు మహాపట్నంగా విస్తరించింది అది సప్త సింధు ప్రాంతం నీటికి లోటు లేదు కొండ ప్రాంతాలనుంచి మైదాన ప్రాంతాలవరకు పురాలను పంచి సాగు చేయిస్తూ వుండేవారు వైదికార్యులు

ఆలమందలతో ఈ దేశాన కాలూనే నాటికి పచ్చని పొలా లెదురయ్యాయి ఆర్యులు పశుపాలకులు పచ్చిక బీళ్ళు తప్ప పొలాలతో వారికి పనిలేదు. పొలాలనే పచ్చిక బీళ్ళు అనుకొనడంవల్ల ఆల కాపరులకు వ్యవసాయదారులకు యుద్ధాలు వచ్చాయి ఇంద్రుడు ఆ పొలాలు ధ్వంసం చేసేవాడు. దాంతో ఆయనకు పురధ్వంసి, పురందర అన్న బిరుదులు వచ్చాయి రుగ్వేదంలో ఒకచోట "నవశాకన్నవతి పురధ్వంసీ దశవేశ్మాని" అని వుంది అంటే ఇంద్రుడు తొంభయి తొమ్మిది పురాలను ధ్వంసం చేసి పది యిళ్ళు పట్టు కున్నాడు అని అర్థం. ఆయినా మన పండితులు పురం అంటే పట్నం అనే భావంతోనే కథలల్లుతున్నారు

ఆనాటి సమాజమే వేరు, నాటి సమాజ సంబంధాలే వేరు. ఆ సమాజము, సమాజ సంబంధాలను గురించి ఇక్కడ క్లుప్తంగా ముచ్చటించుకొనవలసి వుంది తెలుగువారి కూకట్లను వెతకడానికి బయలుదేరి మధ్యన ఈ పిడకల వేట యేమిటి అనిపించవచ్చును. ఇది పిడకల వేటే, తెలుగువారి కూకట్ల పిడకల వేట భూమి అంతటికీ అధినేత దేవర. దైవ ప్రతినిధులు ప్రతి యేటా పాచికలు "సొగటాలు" వేసి భూములను పంచేవారు. "ఏమతుష" భాషలో "సగ్" అంటే తల. "ఏమసల"లో అది "సగుడు" అయింది. సొగటాలు అంటే మన తెలుగులో పాచికలు అని అర్థం సగుడు భూముల పంపిణీకి వాడేవి కనక వాటికి సొగటా అన్న మాట నేటికీ నిలిచింది. పాచికలను సంస్కృతంలో "అక్ష" అంటారు. పాచికలు వేసి పంచే పనిని "అక్ష" క్రియ అనే వారు భూముల పట్టికలను "అక్షపటలం" అంటారు పటలం అంటే బట్ట. ఆ రోజుల్లో రికార్డులను బట్టమీద రాసేవారని ఈ మాటవల్ల అర్థం అవుతుంది.

ఎంగిర్లు మాత్రం బంకమట్టి "పిడకల" మీద రెల్లుగడ్డి కలంతో రాసే వారు. పచ్చి పిడకలమీద రెల్లుగడ్డి కలాలను ఒత్తడంతో మన మేకుల్లాంటి అచ్చు పడేది. అందువల్ల ఆ రాతను "కూనీఫాం" లిపి అన్నారు పశ్చిమ పండితులు మనవారు దాన్ని కీలలిపి అని అనువదించుకున్నారు. అలా రాసిన పచ్చిపిడకల మీద సంతకంగా సీలు ముద్రలు వేసేవారు. ఆ ముద్రలు చాలా దొరికాయి సింధులో. కాని ఆ ముద్రలద్దిన పిడకల మీదికి పండితుల దృష్టి పోలేదు అందువల్ల వాటిని అన్వేషించే యత్నం చేయలేదు అదే చిత్రం.

సొగటాలు వేసి పంచిన భూములదు గృహపతులు యజమానులు కారు. సొంతదారులు కారు అవి దేవుని భూములు దేవకార్యానికి ఉమ్మడి పనులకు నీటి వనరుల కల్పనకు అవసరం కనక ఏటా వారు దేవరకు పన్ను చెల్లించే వారు. భూముల సొంతదార్లు లేరు కనక పన్ను శిస్తు ఒకటిగానే వుండేవి. అది నాటి సమాజ ప్రత్యేకత ఉమ్మడి పనుల్లో అందరూ పాల్గొనేవారు పనిచేసే వారిలో తరతమ భేదాలు లేవు. ఉమ్మడి పనుల విషయంలో దైవ ప్రతినిధులు చండశాసనులు వారి మాటకు ఎదురుండేదికాదు.

ఉమ్మడి పనులను గురించీ దైవకార్యాన్ని గురించీ చర్చించడానికి రెండు సభలుండేవి పురాలు పొందిన గృహపతులను "ఊరబ్బ" లనేవారు. ఆ మాటను ఇంగ్లీషులోకి అనువదిస్తే అది "సిటీ ఫాదర్స్" అవుతుంది ఇది ఎగువ సభ ఈ సభలో ఊరబ్బలు, సంగులు, వర్తక - వేతివృత్తుల ప్రము ఖులు వుండేవారు. ఆలల్లో వుండి ప్రత్యక్షంగా సాగు చేసేవారి ప్రతినిధుల సభకు "ఊరులాలు" అని పేరు. సంధి విగ్రహ సమస్యల్ని చర్చించడం కోసం రెండు సభల సంయుక్త సమావేశం జరిగేది ఈ సుక్కూరునాటి సభా వ్యవస్థ రామాయణ రచనకాలం వరకూ వుండేదనిపిస్తుంది. ఉభయ సభల పరిషత్తును వాల్మీకి వర్ణించాడు. 'బ్రాహ్మణాపుర ముఖ్యాంశ్చ పౌరజన పదైస్సహ' అంటా డాయన.

వ్యవసాయానికి ఒక్క చాంద్రమాన వ్యవహారమే చాలదు. ఋతువుల ఎరికకు సౌరమానం కూడా కావాలి. అందువల్ల ఈ రెండు మానాల సమ న్వయం అవసరం అని వ్యవసాయదారులకు తెలుసును- అలాంటి సమన్వ యాన్ని "యుగం" అంటారు. అయిదేళ్ళకొకసారి యుగ సమన్వయం సులభం కాని సుక్కూరులోని "బ్రాహ్మణులు పురప్రముఖులకు" ప్రతి యేటా భూముల పంపకం అవసరం. అందుకోసం లంకలో వున్ననాడే అసురులిందుకు ఒక సుళువు సూత్రం కనిపెట్టారు వ్యావహారిక మాసానికి ముప్పయి రోజులు నెలకు ఆరు వారాలు. వారానికి అయిదు రోజులు అని నిర్ణయించారు. ఇది అసురమానం. నేటికీ మూడు వందల అరవై రోజుల సంవత్సరాన్ని మనవాళ్ళు సావన సంవత్సరం అంటున్నారు అప్పుడు సావన-సౌరమానాలకు ఒక వారం తేడా వుంటుంది ఆ తేడా అయిదు రోజుల్ని లెక్కల్లోకిరాని పండుగుదినాలు చేశారు ఈ పద్ధతి సింధు నాగరికత ఉన్నంతవరకూ వుండేది. కొత్త సంవ త్సరాదిని"యుగాది"అని తెలుగులు కన్నడిగులు మాత్రమే నేటికీ పిలుస్తున్నారు.

ప్రతి యుగాదికీ సొగటాలు వేసి పురాలు పంచేవారు. పండుగలు వారం సాగెవి ఆవారం రోజుల్లోనూ దైవరాజ ప్రతినిధులైన దొరల్ని ఎవరియిష్టం వచ్చినట్లు వారు యాగీ చేసేవారు ఆ తరవాత కొత్త యేడాదికి కొత్త దొరని ఎన్నుకునేవారు గడిచిన ఏడికి పాత దొర పేరుపెట్టేవారు అలాంటి వారిని పశ్చిమ పండితులు "ఈపోనిమస్ కింగ్స్" అన్నారు మనవారు వర్షోపాధ్యాయులు అంటారు. ఈపోనిమస్ కింగ్స్ అంటే ఏడాదికి తమ పేరునిచ్చే రాజులు అని అర్థం. వర్షోపాధ్యాయుడన్నా అర్థం అదే వారం రోజుల పాటు ప్రకృతుల యాగికి గురైన తర్వాత రాజు అయినా పండితుడయినా జనం దృష్టిలో మూర్ఖునికిందే లెక్క అందువల్లనే వర్షోపాధ్యాయుడు మహా మూర్ఖుడు - మహా పండితుడు అంది బృహత్కథ నేడు మనం చెప్పుకుంటున్న ప్రభవ విభవాది సంవత్సరాలకు పేర్లిచ్చినవారికి మహామూర్ఖులు అన్న పేరుంది ఆ పేరును సమర్థించే పురాణ కథ ఒకటుంది ఆ కథ ప్రకారం వారంతా నారద సంతానం. విధి అంటే బ్రహ్మ. విధికొడుకు నారదుడు వైధి నారదుని కొడుకులు వైధేయులు. "వైధేయకో మూర్ఖజనం:" అంటుంది అమరం ఆ లెక్కన మన అరవై ఏళ్ళకు ఆ పేర్ల నిచ్చిన వర్షోపాధాయులు మూర్ఖులుగానే బతికి వుంటారు ఆ తరవాత. ఆ పేర్లలో కొన్ని అసురనామాలకు సంస్కృతానువాదాలు. సుమేరు అగద భాషల్లో "మురస్సలి" అంటే మేఘనాదం, పిడుగు, దుందుభి. మన సంవత్సరాల్లో ఒకదాని పేరు దుందుభి. వాలి యుద్ధం చేసిన అసుర నాయకుని పేరు దుందుభి ఇప్పుడు బెంగాలీ వారిలో ప్రసిద్ధంగా వున్న పేరు మేఘనాద. రావణుని కుమారుని పేరుకూడా అదే. ఈ అన్నింటికీ మూలం అయిన "మురుస్సలి" అగదపదం. అగదభాష "ఏమసలి." సలి అంటే మధురం గంభీరం ఏమ అంటే వాక్కు అని తెలుసుకున్నాం కదా! మురు, మెరు, ములియు, మెరియు అన్నమాటలు మనకున్నాయి మురుస్సలి అంటే మెరుపుమాట. మేఘనాదం అని అర్థం వస్తుంది కదా!

ఈ జంబూద్వీపాన సుమేరు అసుర సంస్కృతి ఈ స్థాయిలో వుండగా వైదికార్యులు ఆలమందలను తోలుకుని తెరలు తెరలుగా వచ్చారు. ఋగ్వేదంలో పేర్కొన్న పురు, అను, తుర్వసాది కొన్ని గణాలవారికి వ్యవసాయ నాగరికతతో అంతకుముందే పరిచయం వుంది. మైతాణ, భృగు, క్షత్ర గణాలవారు లంకలోను, లంక కెగువనవున్న హిట్టయిట్ సామ్రాజ్యంలోను రాజ్యాలు కూడా

చేశారు. దైత్య, దనుజ లాంటి అసురగణాలకు నాయకత్వం కూడా వహించారు. మరికొందరు కేవల పశుపాలకులు. పశుపాలకులకు ఒక రకంగాను, రాజ్యతంత్ర మెరిగిన వారికి మరొకరకంగాను సింధు నాగరికులతో వైరం ఏర్పడింది ఉభయుల ఆశయమూ ఒకటే-అది దోపిడి బందిపోటు

పశుపాలక సమాజం విశిష్టంగా వుండేది పచ్చిక, కలప పుష్కలంగా వున్న అడవుల్లో గృహపతులు నివాసాలు ఏర్పరచుకునేవారు ఒక గృహంతో మరో గృహానికి సంబంధం వుండేది కాదు "యజ్ఞ రుతువు"ల్లో గృహపతులు ఏదో ఒకచోట సమావేశం అయి, దండనాయక పురోహిత వర్గాలను ఎన్నుకుని ఇంద్రపురస్సరంగా యుద్ధాలకు బయలుదేరేవారు. దోపిడీలను పంచుకుని తిరిగి తమ "గృహాల"కు పోయేవారు ఇదోరకం ఒంటరిపాటు గృహసమాజం-పూర్వం జర్మనీలో కూడా ఇలాంటి సమాజం వుండేది అందువల్లనే నేటి జర్మన్ సంస్కృత పండితులకు రుగ్వేదంలో తమ కూకట్లు కనిపించి వుంటాయి.

ఈ పోలికను బట్టి ఆదిలో తాము కూడా వైదికార్యుల దాయాదులమే అనుకుని తమ జాతిని ఆర్య అని పిలుచుకునేవారు కొనకు ఈ ఆర్యఅహంత ముదిరి హిట్లరులాంటి వానికి జన్మనిచ్చింది ఇప్పుడు ఆధునిక పండితులు దక్షిణాది భాషలన్నింటికీ "ద్రావిడభాష"లని పేరు పెట్టారు. ద్రావిడ అన్నమాట తమిళానికి సంస్కృతీకరణం. అదయినా సూత్రకాలంలో మాత్రమే పెట్టిన పేరు. భారతదేశమంతటా వేదసంస్కృతి విస్తరించిన తర్వాత వచ్చిన పేరు. "ద్రావిడభాష - ద్రావిడసంస్కృతి" అన్న మాటలకు నేడు పెరుగుతున్న అచారిత్రక నామప్రాబల్యం చూస్తువుంటే ఆర్య పదం వేసిన వెర్రితలలు గుర్తుకు రాకమానవు.

పశుపాలకార్యులు ఎన్నిసార్లు ఆలమందల్నితోలి పంటలను మేపినా ఇంద్రుడెన్నిసార్లు "పురాల"ను ధ్వంసం చేసినా "వృత్ర" అన్న పేరుగల ఆనకట్టలను ఎన్నిసార్లు భగ్నం చేసినా సింధుసంస్కృతి చలించలేదు. అయినా ఈ పోరు ఏమలుపు తిరుగుతుందో ఊహించగలిగాడు ధర్మాత్ముడైన ఈతన. తనకు తెలిసిన కొందరు సుమేరు అగద గణాలను వెంటబెట్టుకుని అదివరకే పరిచితమైన కేరళ ప్రాంతానికి వలస పోయాడు. ఈ వలసకూడా సింధునుంచి

పశ్చిమకోస్తా వెంబడే సాగింది కేరళలో స్థానికులకు సంస్కృతి మప్పాడు. అందువల్లనే కేరళీయులు నేటికీ "మహాబలి"ని స్మరించుకుంటూ వుంటారు. తమ సంస్కృతిదాత అని చెప్పుకుంటూ వుంటారు

మన పురాణాలు కూడా అసురుడైన బలిని దుర్మార్గు డనలేదు అతడితో యుద్ధం జరగలేదు. మంచితనంతోనే అతడు భూముల్ని విడిచి పెట్టాడు. అప్పటికి వైదికార్యుల బలం "వామన సన్నిభం" అయినా ఈ భూమి విడిచి పాతాళానికి అంటే దక్షిణాదికి ఐచ్ఛికంగా వెళ్లాడు సుక్కూరులోని బరు సంగులు వెళ్లవద్దు యుద్ధం చేదామన్నారు సుక్క అన్నమాటే "శుక్ర" శబ్దంగా పరిణమించిందని తెలుసుకుంటే "బలి" దూరదృష్టి ఎంత గొప్పదో అర్ధం అవుతుంది ఈతని దూరదృష్టి మనందరికీ గర్వకారణం ఆఖరికి ఈతన ఊహించినంత పనీ అయింది

కప్త అంటే క్రేటే నుంచి వచ్చిన "పైజవానుడు" శంబరులతో నల బై సంవత్సరాలు పోరాడినట్లు రుగ్వేదం చెబుతుంది. శంబరులు ఓడినట్లు కాని పైజవానుడు గెలిచినట్లు కాని దాఖలాలు లేవు వేద రుషులు తమ ఒంటరి తనాన్ని విడిచిపెట్టారు ఒకచోట చెరి చాలాకాలం చర్చలు జరిపి వుంటారు. యజ్ఞ రుతువుల్లోనే కలవడం వీరికి అలవాటు ఇప్పటి దీర్ఘకలయిక "సత్ర యాగం" అయివుంటుంది. దీర్ఘకాలం చేసే యజ్ఞానికి "సత్రం" అని పేరు ఆ సత్రంలోనే సుక్కూరు విధ్వంసానికి ఆలోచనలు చేసి వుంటారు. సత్రం అంటే వేయేళ్ళు అని కూడా అర్థం సుక్కూరు విధ్వంసానికి కూడా వేయేళ్ళు పట్టిందని పురాణాలంటున్నాయి సుక్కూరు విధ్వంసాన్ని "త్రిపురదాహం" అన్నాయి పురాణాలు

సుక్కూరు మూడు రకాల పౌరులకు కేంద్రస్థానం. దున్నడం, విత్తనాలు "ఎద" బెట్టడం ఏకకాలంలోనే చేసే "ఖుర్ర" నాగళ్ళు కూడా ఎంగిర్లకు తెలుసును. కాగా నేల స్వభావాన్ని బట్టి రాతినక్కులు, రాగి నక్కులు, కంచు నక్కులుగల మూడు రకాల నాగళ్ళనూ వాడేవారు. వాటినే వ్యవసాయం ఎరగని వేదర్షులు అళ, అయసీ, కాంశ్యపురాలని పిలిచారు. సుక్కూరు ఉద్యోగుల పట్టికల్లో కూడా వాటికి "తుషిత" లేదా "సల" భాషలో ఆ పేర్లే వుండివుంటాయి. ఉగాది నాటికి "పన్ను" ధాన్యాన్ని తీసుకుని ఈ మూడు

రకాల పొరలు సుక్కూరు చేరుకుంటారు. దైవ ప్రతినిధులైన "దొరలు" సంగులుకూడా అక్కడికి చెరుతారు. పైగా "వారం" రోజులపాటు "సుర" అంటే బీరు ఏరులై ప్రవహిస్తుంది జనం అంతా అడిగే "నాధుడు" లేని స్థితిలో వుంటారు "ఇది మంచి తరుణమోయీ" అనుకుంటూ ఆర్యగణాలన్నీ ఒక్క-మ్మడి సుక్కూరు చేరి దహనకాండ జరిపివుంటాయి అదే త్రిపుర దాహం, త్రిపురాసుర సంహారంగా పురాణాల కెక్కింది

అంతకుముందు సుక్కూరు చండశాసన దొరకు "తారకాసురు"డని పేరు దాడి జరిపేనాటికి తారకాక్ష, కమలాక్ష, విద్యున్మాలి అన్న అసుర దొరలుండే వారని మన పురాణాల కథనం. ఈ యుద్ధం, త్రిపురదాహం ఎంత భయానకంగా జరిగిందోకాని భరతముని ఆడించిన తొలి నాటకానికి త్రిపురదాహం ఇతివృత్తం అయింది. అంటే పోరాటం, విజయోత్సవం ఇవే నాటకాలకు సాహిత్యానికి ఇతివృత్తంగా వుంటాయన్న సత్యాన్ని అది నిరూపిస్తుంది

తుషిత భాషలో "అసు" అంటే వైద్యుడని అర్థం; అతడు శల్యాశలాక తంత్రాలెరిగిన వైద్యుడు. మణిమంత్ర ఔషధప్రయోక్తను "అసిపు" అనేవారు వీరిద్దరూ జంట "ఇని" అంటే కన్ను కంటి వైద్యుని అశ్విని అనేవారు. పేరు ఒకనిదే అయినా "అస-అసిపు" లిద్దరూ జంటగా వేదాలకెక్కారు. వేదాల్లో అశ్వినీ దేవతలు జంట వారి రథానికి గాడిదలేకాని గుర్రాలుండవు గుర్రాలను మచ్చిక చేసుకున్న ఆద్యులు క్షత్రులు (హిట్టయిట్లు) సుమేరు ఆగదుల రథాలకు గాడదలనే పూన్చేవారు వైదికార్యులకు గాడిదలు తెలియవు అందువల్ల వాటిని గాడిదల్లాంటివి - 'అశ్వతర' అన్నారు

తుషిత భాషలో "మరతు" అంటే పడమర. ఎంగికి పడమర నున్న సంచారజాతులను మరుత్తులనేవారు వారికి పచ్చిమాంసం తప్ప దాన్ని కాల్చు కుని తినడంకూడా చేతకాదు అంటూవుండేవారు ఎంగిర్లు. అయినా వాళ్ళంటే అభిమానం వాళ్ళదేవుని పేరు మరుత్తు. ఈ మరుత్తులు ఎంగిర్లకే కాదు, వైది కార్యులకూడా అభిమాన పాత్రులే. అశ్వినులను చాలాకాలంవరకు తమ సమాజంలో చేర్చుకొనలేదు వైదికార్యులు. చ్యవనుని కన్ను బాగుచేసిన తరు

వాత ఆయన పట్టుదలమీద అశ్వినులకు హవిర్భాగార్హత కలిగింది హవిర్భాగం అంటే సహపంక్తి భోజనం-మరుత్తులు మిత్రులే అయినా వారికా యోగ్యత పట్టలేదు మరుత్తులనే "అమొరైట్స్" అంది బైబిలు "అముర్రు" అన్నారు అసురులు. మరుత్తులది సెమెటికుభాష. బాబిలను పాలకులు ఈ మరుత్తులే.

ఎంగిర్ల మరొకదేవుడు "నబు" మన బుధుని లాంటివాడు జ్ఞానానికీ రాతకు, వర్తకానికీ ఇతడు అధిపతి అందువల్ల "రాయసాల"క్కూడా దేవుడు అతడు "కుశ" హస్తుడు కుశ జ్ఞాన చిహ్నం మన శివనంబులు, విష్ణునంబులు, నమ్మాళ్వార్లు, నంబూద్రీలు ఈ నబుదేవుని పేరనే వచ్చారు లంకలోనే కాదు నాటి ఈజిప్టు ఇతర ప్రాంతాల్లో క్కూడా రాతకు కుశలే ఆధారం కుశను ఎంగిర్లు "పుల్లు" అంటారు పులు పూరి, కసవు ఇవి తెలుగున గడ్డికి పేర్లు తెలుగున పులమాయి, పులకేశి అన్న రాజులపేర్లకీ తొలి సప్తర్షులైన పులహ పులస్త్య పేర్లకూ మూలం ఈ పుల్లే. అలాగే పులిందులుకూడా "పులు"తో సంబంధం గలవారే ఇక పూరి కూడా తెలుగున పులుకు రూపాంతరం పులు, పూరి గడ్డి అయినా మనమంతా తినేది ఆ గడ్డిగింజలేకద! పురాణాల్లోని పురు వంశజలు కూడా వ్యవసాయదారులు పులు, పూరికి మరోపేరు కసవు కసవు నుంచే సంస్కృత ''కుశ" శబ్దం పుట్టింది వీరుకూడా వ్యవసాయాభిమానులు, విశ్వామిత్రుడు కుశనాభుని మనవడు కౌశికుడు. ఆయన పినతండ్రి గిరివ్రజాన్ని కట్టాడు. అక్కడి పురాలకు సేద్యపునీరిచ్చిన నది పేరు సుమాగధి ఆ నదిపేరు మీదనే మగధ సామ్రాజ్యానికి పేరు వచ్చింది. ఏమయినా ఈ చరిత్ర పొడవునా తెలుగుతనం కనిపిస్తుంది.

సుమేరులో రాయసాలు గవని వాకిట నుండేవారు గవని దేవరను అబుల్లు అనేవారు అతడు కుశహస్తుడు అబుల్లును గ్రీకులు ముందు అపుల్లోన్‌గా తరవాత అపోలోగా మార్చుకున్నారు కుశ రాతిమనే వారు పైలోన్ అన్నారు. నాగార్జునసాగరం దగ్గరున్న "పైలోన్" కోసురాయి ఆ కుశ ప్రతిమయే కదా! అబుల్లు మనకు ప్రోలు అయింది ప్రోలు అన్నది పులు, పూరి కలిసి ఏర్పడిన మాట. రాజస్థానంలోని కోట గవనులను వారిప్పటికీ ప్రోలు, పోలు అని తెలుగు మాటల్లోనే పిలుస్తున్నారు. తెలుగు పెళ్ళిళ్ళలో నాగవల్లినాడు పిడత లకు దారాలు చుట్టి కోట కట్టి దాని ముందు ముగ్గుతో ప్రోలు పెడతారు.

అంటే గవనిని చిత్రిస్తారు తెలుగునాట ప్రోలు అన్న గ్రామాలు చాలా వున్నాయి. అవి ఒకనాడు రాయసాలకు కేంద్రాలయి వుండవచ్చును. లేదా గవని వాకిళ్ళయి వుండవచ్చును

సైనిక సేవలకు ఇతర ప్రత్యేక సేవలకు కొన్ని 'ఆల'లను కేటాయించే వారు అలాంటి గ్రామాలకు పొలిమేరలను నిర్ణయించి రాళ్ళు పాతేవారు. అలాంటి రాళ్ళను "కుదురు స్టోన్స్" అని పండితులంటున్నారు. అవి ఆ రాళ్ళ పేర్లు కావు. ప్రత్యేక సేవా గ్రామాలకే ఆ పేర్లుండే వనిపిస్తుంది. తెలుగునాట "కుదురు" అన్న గ్రామాలు చాలా కనిపిస్తాయి బాబిలను రాజుల కాలంనాటికి ఇనాం భూముల పద్ధతి కూడా వచ్చింది అంటే ఆ భూముల్ని సాగు చేసేవారు యజమానికి శిస్తు యివ్వాలి. అంతవరకు పన్ను శిస్తు ఒకటే. ఇప్పుడు భూమి మీద ప్రైవేటు యాజమాన్యం వచ్చింది అలా చెల్లించే శిస్తుకు "మాందాతు" అని పేరు.

వైదికార్యులకు వ్యవసాయం నేర్పడంలో అశ్వినీ దేవతల హస్తం కూడా వున్నట్లు కనిపిస్తుంది పురాణాల్లో "మాంధాత" అని ఒక రాజున్నాడు. అతడి పుట్టుక "శూరుల జన్మంబు సురల జన్మంబు ." లాంటిది ఆయనకు "క్షేత్ర పతిత్వం" అంటే భూ కామందు గిరీని అశ్వనీ దేవతలు నేర్పారని ఋగ్వేదంలో వుంది అంతేకాదు. మనవాళ్ళు పాత కాలం అని చెప్పడానికి ఇక్ష్వాకుల కాలం, బిసీ, అంటూ వుంటారు కాని తెలుగు రైతులు మాత్రం భూముల ప్రస్తావన వచ్చినప్పుడు "మాంధాతల కాలం నుంచీ" అంటారు. ఈ మాట తెలుగురైతుల నోటనే కాని మరొకరి నోట వినబడదు. అందువల్లనే చారిత్రకాధారాల కోసం తెలుగు ప్రాకృతాన్ని పరిశీలించాలి అంటాను. "మాంధాతు" అన్న మరుత్త భాషాపదం ప్రాకృతుల నోటనే నేటికీ సార్థంగా సజీవంగా వుంది మరి! ఇలాగ తెలుగు ప్రాకృత ప్రభావం వేదాల మీద కూడా కనిపిస్తుంది. ఇలాంటి తెలుగును సంస్కృతీకృత తమిళం అంటే ద్రావిడం అనడం ఎంత అసంగతమో విదితం అవుతుంది. వెంగిర్లు దేవుడ్ని "డింగరి" అంటారు. డింగరి అంటే శిష్యుడు అని అర్థం చెబుతారు పండితులు. "గురు" అన్న బరువైన మాటను

"ఏం గురూ" అని మనవాళ్ళన్నట్లే డింగరికా అర్ధం కాలక్రమేణా వచ్చి ఉండ వచ్చును ఏమయినా డింగరి అన్నది సూత్రం తెలుగుమాట

త్రిపురదాహంతో సుక్కూరు ధ్వంసమై దిబ్బ దేరింది నగరం ధ్వంస మైనా సామాజిక భావాలు ఆచారాలు విశ్వాసాలు ధ్వంసం కాలేదు శిథిల నగరానికి దగ్గరలోనే వారు తిరిగి సుక్కూరును కట్టుకున్నారు. ఇంగ్లీషువారు అక్కడి సింధునది మీద బ్యారేజి కట్టారు. ఆ భాగం పాకిస్తానుకు పోయింది. అయినా సుక్కూరు బ్యారేజి వుంది పక్కనే సుక్కూరు పట్నం వుంది. అక్కడి జనం ఇప్పుడు ఏ భాష మాట్లాడుతున్నా వారి ఆచారాల్లో ఆలోచనల్లో తెలుగుతనం ఉండి తీరుతుంది

సుకూరు దేవళం ధ్వంసమయింది సుక్కదేవత తారగా వజ్రయాన బౌద్ధులకు ఆరాధ్య దేవత అయింది ఇతర శాక్తేయులు ఆమెను 'బాల'గా ఆరాధిస్తున్నారు బాల అని పేరు పెట్టుకున్నా సుక్కూరు సంబంధాన్ని ఆ పేరునుంచి చెరపలేదు బాలను బాలాత్రిపురసుందరి అని నేటికి ఆరాధిస్తు న్నారు. ఒకనాడు అశ్మ, ఆయసీ, కాంస్యపురాలుగా పేరు పొందిన కమతాలు ఆయస, జిల్లరు, ట్రాక్టరు త్రిపురాలుగానే వున్నాయి నేడు నాటి సుక్క నేడు బాలాత్రిపురసుందరిగానే వుంది దున్నే సాధనం ఏదయినా కమతాలన్నీ సుందరాలే కదా? అంకి, మారి, అసిరి, సుక్క ఏ పేర పిలిచినా మన పల్లెల్లో సుక్క తల్లికీ పచ్చని పొలాలకూ సంబంధం అనుబంధం ఇప్పటికీ అలాగే వుంది.

తిరుమల కొండమీద తొలుత బౌద్ధుల తారా విగ్రహం ఉండేదనీ తరవాత ఉత్తరాది మహంతులు దాన్ని ఆక్రమించి ఆమెను బాలాత్రిపుర సుందరిగా కొలిచేవారనీ చరిత్రకారులంటున్నారు. అదే విగ్రహంమీద బంగారు రేకులు తాపడంచేసి "పుంస్త్వ" మిచ్చి వైష్ణవులు వెంకటేశ్వరునిగా మార్చారనీ మరికొందరంటున్నారు. వెంకటేశ్వరుడంటే "ఎంకి" వేంగినాథుడు. ఎన్ని మార్పులు చెందినా ఎన్ని పేర్లు మారినా తెలుగు దేవుడే. ఉత్తరాదివారు దేవర రూపంమారినా వెంకటేశ్వరుడిని "బాలాజీ" అనే పిలుస్తున్నారు.

సుమేరులు భూమ్మీద తాము నిర్మించిన రాజ్య వ్యవస్థను ఆకాశాన దేవ వ్యవస్థకు మార్చారు. భూమ్మీద వ్యవస్థ మారినప్పుడల్లా స్వర్గ వ్యవస్థ కూడా మారుతూ వచ్చింది. బాబిలను నగరాన "హమ్మూరబి" రాజ్యానికి వచ్చిన నాటికి సమాజ వ్యవస్థలో పెద్ద మార్పులు వచ్చాయి హమ్మూరబి మరుత్తు అంటే సెమెటికు ప్రభువు అతడి కాలాన్నే "మర్దుక్" మహాదేవునిగా అవతరించాడు అదివరకటి "దైవపరిషత్తు" వ్యవస్థ మారింది మర్దుక్ ఏకేశ్వరునిగా అవతరించాడు. మర్దుక్ పేరు కూడా తెలుగు వారికి మరిడి, మరిడయ్యగా వచ్చింది సంస్కృతాన "మృడ" అయింది

మర్దుక్ ఏకేశ్వరుడే అయినా గత పరిణామాన్ని మత నాయకులు పూర్తిగా తుడిచివేయలేకపోయారు మర్దుక్ అవతరణ, ఏకేశ్వరత్వాల మీద ఒక కావ్యం పుట్టింది దానిపేరు "ఎనూమాఎలిష్" అంటే "అప్పుడు పైన" అని అర్థం పశ్చిమ పండితులు ఈ కావ్యానికి "బాబిలన్ సృష్టిగాథ"అని పేరు పెట్టారు ఈ గాథ బైబిలు పాతనిబంధన రచనకు వేయేళ్ళు ముందుది. దీనికి బైబిలుకూ చాలా పోలికలున్నాయని పశ్చిమ పండితులు గ్రంథాలు రాశారు ఆ విధంగా మెసపొటేమియా ఏకేశ్వర మతాల అవతరణకు మునుము పెట్టింది

మర్దుక్ నాటికి దైవ మానవ సంబంధాలు సేవ్యసేవక సంబంధాలుగా మారాయి అంటే బానిస రాజ్యవ్యవస్థ పూర్తిగా నెలకొన్నది దేవుడు ప్రభువైతే మనిషి దాసుడు. సెమిటికు జాతుల్లో పుట్టిన మూడు మతాలు - యూదు క్రైస్తవ ఇస్లాం మతాల మూలసూత్రం ఇదే దైవ మానవ సంబంధాలు ప్రభు దాస సంబంధాలు. ప్రభువు ఒక్కడే అతడు మరొకరితో అధికారం పంచుకొనడు - మనిషి ఇంకొకరిని సేవిస్తే సహించడు ఇలాంటి ప్రభువు - అంటే ఏకేశ్వరుడుగల మతాలు మనకు కూడా పుట్టాయి ఇవి దక్షిణాదినే పుట్టడం, అక్కడే వ్యాప్తిచెందడం విశేషం

శివభక్తి శివపూజ దేశం అంతటా వుంది కాని దక్షిణాది పాశుపత శైవంలో దైవ మానవ సంబంధాలు సేవ్య సేవక సంబంధాలు దేవుడు పశుపతి మనిషి లెంక - అంటే బానిస. పశుపతి వాహనం అంటే బసవని స్థాయికి పెరగడం మానవుని ధ్యేయం అలాగే విష్ణుపూజ దేశమంతటా వుంది కాని

దక్షిణాది వైష్ణవంలో నారాయణుడొక్కడే ప్రభువు మనుషులంతా దాసులు అంతేకాదు, దాసులకు దాసులు నారాయణుని వాహనం గరుడుడు. ఆ స్థాయికి పెరగడం మనిషి ధ్యేయం

ఏకేశ్వర మతరూపంలో కాకపోయినా సెమెటిక్కుల్లో పెరిగిన ఈ మత భావాలు లేదా ఆ భావబీజాలు సుమేరు కాలంలోనే పుట్టాయి. అందువల్లనే కేరళీయులు తమ దేశానికి వచ్చిన యూదులను అల్లుళ్ళుగా ఆదరించారు అల్లుళ్ళను "మాపుళ్లె" అంటారు తొలితరం క్రైస్తవులను తరవాత అరబ్బులను అరబ్బీ ముస్లింలను అల్లుళ్ళుగానే ఆదరించారు. ఈ అందరినీ వారు అల్లుళ్ళనే పిలుస్తారు అందువల్ల మత అసహనం అన్నది దక్షిణాదివారి మనస్తత్వాన లేదు. పాశుపత శైవానికి కన్నడం, శ్రీ వైష్ణవానికి తమిళం మతభాషలు. తెలుగున అలాంటి మతం పుట్టలేదు. కేరళాన కూడా పుట్టలేదు.

ఇప్పుడేమయినా అలాంటి అసహనం కనిపిస్తూవుంటే అది ఇతరభాషలు ముఖ్యంగా ఉత్తరాది వారి ప్రభావంవల్లనేకాని స్థానికుల మనసుల మార్పువల్ల మాత్రం కాదు ఉపయుక్తం అని తోచిన సకల భాషాపదాలను సంస్కృతులను జీర్ణం చేసుకొనగల శక్తి తెలుగువారికి ఈ కారణాలవల్లనే కలిగింది తెలుగు కూకట్లు పిల్చుకుంటున్న అన్నసారం అలాంటిది.

—: o :—

# 3. తీరాంధ్రంలో సద వంశీకులు— సాతవాహనపూర్వ రాజవంశము

—పురాణం రాధాకృష్ణ ప్రసాద్

మౌర్యుల పరిపాలనలో దక్షిణాపధంలో అనేకమంది రాజ ప్రతినిధులు, అధికారులు ఉండేవారు ఎక్కువ సందర్భాలలో ఈ అధికారులు స్థానికులై ప్రజలలో తగిన పలుకుబడి నాయకత్వం గలవారుగా ఉండేవారు. కేంద్ర ప్రభుత్వాధికారం బలహీనమై పూర్తిగా పడిపోయినప్పుడు ఈ అధికారుల్లో కొంతమంది ఆ యవకాశాన్ని వినియోగించుకొని తమ పాలనా పరిధిలో స్వతంత్రులైనారు అటువంటి వారిలో సాతవాహనులతోబాటు మహా తల వరులు, మహా దండనాయకులు, మహా రర్థులు, మహా గ్రామకులు, మహాసేబ కులు, సేన గోపులు మొదలైన కొంతమంది ఉన్నట్లు వారు ముద్రించిన నాణె ముల వలన తెలుస్తుంది.

వీరిలో బలవంతులైన సాతవాహన కుటుంబీకులు మరికొన్ని తోటి కుటుంబాలతో కలిసి కొంతమంది యితర ముఖ్యుల తోడ్పాటుతో పైరానుకు ప్రక్కలనున్న చిన్న రాజ్యాలను లోబరచుకొని తమ భూభాగాన్ని విస్తృత పరచుకొని అందరిలోను బలవంతులయినారు. అయినా కొంతమంది ప్రధానులు వీరి అధికార పరిధి వెలుపలనే స్వతంత్రంగా మనుగడసాగిస్తూ సాతవాహను లతో సత్సంబంధాలు కొనసాగించారు. గౌతమీపుత్ర సాతకర్ణి తనకాలంలో ఈ చిన్న రాజ్యాలన్నింటినీ లోబరుచుకొని ఒకే అధికారం క్రింద దేశాన్ని ఏకీకరణ చేయటం జరిగింది.

మౌర్య సామ్రాజ్య శిధిలాలమీద వేర్వేరు ప్రాంతాలలో మూడు స్వతంత్ర రాజ్యాలు వెలిశాయి మగధ ప్రాంతంలో శుంగులు, మధ్య దక్షిణాపథంలో సాతవాహనులు, వీరికి సమకాలీనులుగా తూర్పు తీరంలో మేఘవాహనులు రాజ్యాలు స్థాపించుకున్నారు.

హాతీగుంఫా శాసనంలో ఖారవేలుడు కళింగను పాలించిన రాజుల్లో తాను మూడవ తరం వాడినని[1] (తృతీయే కళింగ రాజవంశ పురుషయుగే), చేది వంశీయులలో మహా మేఘవాహన కుటుంబానికి చెందిన వాడినని చెప్పు కొన్నాడు "అయిర" అన్న గౌరవ వాచక పదం బహుశ "ఆర్య" అనే అర్థంలో తాను ఉత్తమ వంశజుడ నని సూచిస్తూ పేరుకు ముందు ఉపయో గించుకున్నాడు మహారాజు నని అంటే స్వంత రాజ్యాధిపతి నని చెప్పుకు న్నాడు. ఆయన రాజ్యం గోదావరి నుంచి పూరీ జిల్లా వరకు, యింకా ఉత్తరా నికి కాకపోయినా కనీసం ఆయన శాసనం లభించిన ఉదయగిరి కొండల వరకు వ్యాపించి ఉంటుంది. కళింగ నగరం ఆయన రాజధాని. ఇది తీరాంధ్రలో నేటి శ్రీకాకుళం జిల్లాలో ఉంది.

మౌర్యుల అధికారం అస్తమించిన తర్వాత తీరాంధ్రంలో సాతవాహ నులు వచ్చేదాకా కొంతమంది స్థానిక ముఖ్యులు వేరువేరు ప్రాంతాలలో అధి కారం చెలాయించినట్లు తెలుస్తుంది భట్టిప్రోలు మంజూష మీది శాసనం వలన[2] ఖుబిరకుడు అన్న రాజు బ(హుశ యక్ష వంశీయుల్లో ముఖ్యుడు), వడ్డమాను శిలా లేఖనంలో[3] ఉదహరించబడ్డ సోమకు డన్న రాజు (బహుశ నాగ వంశీ యుడు), వరుసగా భట్టిప్రోలు, వడ్డమాను పరిసర ప్రాంతాల్లో క్రీ.పూ. రెండవ శతాబ్దంలో పాలించినట్లు తెలుస్తుంది వీరే కాకుండా అమరావతి శాసనాలవల్ల తరువాత కాలంలోని మరికొన్ని రాజకుటుంబాలవారుగూడా తెలుస్తున్నారు

ఒక గ్రెనైటు స్తంభం మీది లేఖనంలో[4] "కుమార అవతకాము" అని, మరొక చలువరాతి ఉష్ణీషం మీది లేఖనంలో "రాజకుమారియ సమ్మలియ" అని క్రీ.పూ. ఒకటి - రెండు శతాబ్దాల నాటి బ్రాహ్మీ లిపిలో ఉదహరింపబడ్డ యిద్దరు, క్రీ శ. ఒకటి - రెండు శతాబ్దాల నాటి లిపిలో మూడవ లేఖనంలో[5] "శివమకసద" అన్న మరొక రాజు తెలుస్తున్నారు

పెద వేగి త్రవ్వకాలలో ఈ మధ్యనే కొత్తగా లభించిన మరొక చలువరాతి శాసనం[6] ద్వారా "కికిచకుడ"న్న రాజు నాగపర్వత (గుంటుపల్లి) పరిసర ప్రాంతాల్లో ఈ శతాబ్ది ఆరంభంలో ఉన్నట్లు తెలుస్తుంది ఈ పేర్లే తప్ప యితర వివరాలు వీరి పరిపాలనా ప్రాంతం కాని, సమయం కాని

తెలియవు ఈ పేర్లతోపాటు వేల్పూరు శాసనం[7] ద్వారా మానసద లేక మహా సద, గుంటుపల్లి శాసనం[8] వల్ల శ్రీ సద మనకు తెలుస్తున్నారు బహుశ వీరందరూ తీరాంధ్రంలో గౌతమీపుత్ర సాతకర్ణి దిగ్విజయ యాత్రలో ప్రారంభమైన మలిసాతవాహనుల పాలనకు ముందు వేర్వేరు ప్రాంతాలలో రాజ్యాధికారం నెరపినవారై ఉంటారు

హాతిగుంఫా శాసనం ప్రకారం కళింగాధిపతి ఖారవేలుడు తన రెండవ రాజ్య సంవత్సరంలో పశ్చిమాన ఉన్న సాతకర్ణి (మొదటి) ని లెక్కచేయకుండా కణ్హబెన్నాతటంలోని ఋపిక లేక అసిక[9] నగరాన్ని పట్టుకున్నాడు. పదకొండవ రాజ్య సంవత్సరంలో పిథుండ[10] నగరాన్ని పట్టుకొని ధ్వంసం చేశాడు. ఇంకా దక్షిణంగా నడిచి ద్రవిడ రాజ సమాఖ్యను ఓడించాడు ఈ రెండు ప్రాంతాలను గుర్తించడంలో పండితులు విభేదించినా రెండునూ తీరాంధ్రంలోనివే ననటంలో ఏకీభవించారు అటువంటప్పుడు కళింగాధిపతియైన ఖారవేలుడే తీరాంధ్రంలో కృష్ణా - గోదావరి పరీవాహక ప్రాంతం మీద దండెత్తిన మొదటి రాజుగా నిర్ణయించవచ్చు అయితే ఆయన దండయాత్ర తాత్కాలికమైనదో లేక జయించిన ప్రాంతాలను స్థిరంగా నిలుపుకున్నాడో చెప్పలేము.

ఇక యిప్పుడు నాణెములవలన లభించే ఆధారాలను పరిశీలిద్దాం కోస్తా ప్రాంతంలో మలి సాతవాహన నాణెముల పరంపరతోపాటు పరిమాణంలోను, బరువులోను గూడా పెద్దవిగా ఉండే సింహపు ముద్ర గల నాణె పరంపర లభించింది వానిలో కొన్నింటిమీద అసంపూర్తిగా లేఖనాలు - ఎక్కువ సందర్భాలలో లేఖనంలోని చివరి అక్షరాలు "సదస" మాత్రమే - మిగిలి ఉండటం కనపడుతున్నది.

ఇవి ఎక్కువగా తీరంలోని వివిధ ప్రాంతాలలో - ఉత్తరాన ముఖలింగం నుంచి దక్షిణాన పడుగుపాడు వరకు- వ్యాప్తిలో ఉన్నట్లు తెలుస్తుంది అయితే వాటి కేంద్రీకరణ అమరావతి - ధరణికోట ప్రాంతంలోనే గుర్తిస్తాము. ఇవి సీసం, రాగి, పోటీను మిశ్రధాతువులలో వర్తులాకారంలోనూ, చతురస్రాకారంలోనూ అచ్చుగుద్ది ముద్రించిన నాణెములు. వీనిలో చిన్నసైజు నాణెములు గూడా ముద్రించారు. ఇవి తక్కువ విలువకొరకు ఉద్దేశించినవి ధరణికోట

లోని కోట ప్రాంతంలోను,[11] అమరావతిలోని స్తూప ప్రాంతంలోను, వడ్డమానులో జరిపిన త్రవ్వకాలలోను ఈ నాణెములు ఎక్కువగా లభించినవి హైదరాబాదు రాష్ట్ర సంగ్రహాలయంలో నమోదు అయిన నాణెములు గూడా ఉపరితలంమీద లభించినట్లు, ఎక్కువ సంఖ్య అమరావతి - ధరణికోట ప్రాంతంలోను, తీరాంధ్రంలోను లభించినట్లు తెలుస్తుంది.

ఈ నాణెముల పరిణామగతిని పరిశీలించినట్లయితే తీరాంధ్రంలోని సాతవాహన నాణె పరంపరలో ఇమడవు సాతవాహనుని కొన్ని నాణెముల మీద "సాదవాహన" అని, సాతిసిరి నాణెములమీద "సాతస" లేక "సిరిసాతిస" అని ఉండటం పండితులు గమనించారు ఈ లేఖనాలను దృష్టిలో ఉంచుకొని "సదస" అన్న లేఖనం చివర కనిపించే ఈ నాణెములను గూడ సాతవాహనులవేనని భావించారు[12] కాని పరిణామగతిని గమనించి పండితులు ఈ భావనను సందేహించినా ఈ సమస్యనుగూర్చి తీవ్రమైన ఆలోచన చేయలేదు. వీనిని సాతవాహనునకు, సాతిసిరికి, పులుమావికి లేక సాతకర్ణికి అనేక విధాలుగా చెందినట్లు భావించారు[13] కొందరు పండితులు సాతవాహనులవిగా వీనిని అంగీకరించనూ లేదు, మరే రాజవంశానివో సూచించనూ లేదు[14]

ఏమైనప్పటికి ఇటీవల వడ్డమానులో లభించిన నాణెములను బిర్లా సంస్థవారు (శ్రీమతి కస్తూరిబాయి)[15] విడి నాణెములను న్యూమిస్‌మాటిక్ సొసైటీ ఆఫ్ హైదరాబాదువారు (సర్వశ్రీ రాజా రెడ్డి, సూర్యనారాయణరెడ్డి)[16] ప్రకటించటంతో ఇప్పటివరకు ప్రకటింపబడినవి, బడనివి అన్నింటిని పునఃపరిశీలించవలసిన అవసరం కలిగింది.

ఈ నాణెం సాధారణంగా ఈ క్రింది విధంగా ఉంటుంది :

**ఉపరితలం :** కుడివైపునకుగాని, ఎడమవైపునకుగాని తిరిగి, తోక ఎత్తుకొని నిలువబడిన సింహము, దానికి ముందు భాగంలో కొమ్మలతో నుండి చుట్టూ దడి గట్టబడి ఉన్న వృక్షము అనేక విధాలుగా చిత్రించబడి ఉంటుంది,

వెనుకవైపు : ఎక్కువ సందర్భాలలో ఖాళీగా వదలిపెట్టబడింది కొన్నింటి మీద ఆరు శిఖరాలతో గూడిన కొండ, ప్రతి శిఖరంలోను ఒక చుక్క, ఈ కొండ చుట్టూ రెండు రేఖలతో గూడిన ఒక చదరపు చట్రము అనేక విధాలుగా చిత్రించారు.

కొన్ని నాణెముల ఉపరి తలం మీద సింహపు గుర్తు మీది భాగంలో "సదస" అన్న అక్షరాలతో ముగిసే లేఖనం క్రీ.శ. ఒకటి, రెండు శతాబ్దాల నాటి బ్రాహ్మీలిపిలో కనుపిస్తుంది, ఈ నాణెముల మీద "ఉజ్జయిని" చిహ్నం లేకపోవటం గమనించదగ్గ విశేషం

సాతవాహనులు సింహపు గుర్తుగల నాణెములను తీరాంధ్రంలో ప్రవేశ పెట్టినట్లు కనపడదు రెండవ సాతకర్ణి యొక్క "సింహపు" నాణెములు మధ్య దేశపు నాణె పరంపరంలో[17] కనుపిస్తున్నప్పటికి ప్రస్తుత నాణెములతో పోల్చితే అవి వేరు విధంగా ఉండటం గమనిస్తాం.

ఇరువది గ్రాములకుపైగా బరువుండి (కొన్ని 30 - 40 గ్రాముల మధ్యగా కూడ ఉంటూ) ఉపరి తలం మీద సింహము, వెనుకవైపు ఖాళీగా గాని, చట్రంలో ఉండే కొండగుర్తుగాని ఉండి ఉజ్జయినీ చిహ్నం లేకుండా ఉండే ఈ నాణెములు సాతకర్ణి యొక్క పైనుదహరించిన నాణె పరంపరలో చేరక, పీనికై యివి ఒక ప్రత్యేక తరగతికి చెంది, కోస్తా ప్రాంతంలో సాతవాహనుల నాణెములకన్నా ముందు కాలానికి చెందుతవి. అయితే సింహము-ఉజ్జయిని గుర్తు గల కొద్దిపాటి నాణెములు గూడ ఇక్కడ తీరంలో దొరికినవి. పీటిని సరిగా గుర్తించవలసి ఉంది. కొన్నింటిమీద 'సామిస' అన్న లేఖనం గూడ కనపడు తుంది. ఈయనను వాసిష్ఠిపుత్ర పులుమావిగా భావిస్తారు[19] ఈ ప్రాంతానికి క్రొత్తగా రాజైన మొదటి రోజుల్లో పీనిని ప్రచురించి ఉంటాడు తన స్వంత నాణెములను చలామణిలో ప్రవేశపెట్టడంతోపాటు తన పూర్వపు రాజుల నాణెముల వలెనే కొద్ది సంఖ్యలో పీనిని ప్రచురించి ఉంటాడు.

ఈ నాణెముల మీద 'సద' పదంతో అంతమయ్యే లేఖనాన్ని బట్టి ఈ నాణెములన్నీ సద వంశస్థులవిగా భావించవచ్చు వేల్పూరు, గుంటుపల్లి, అమరావతి శాసనాల్లో సద పదంతో అంతమయే రాజుల పేర్లు మూడు కన్పి స్తున్నవి.

1 అయిర మహారాజ సిరిమా(న)సద లేక మహాసద (వేల్పూరు)[20]
2 మహారాజ కళింగ మహిసకాధిపతి మహామేఘవాహన సిరిసద (గుంటుపల్లి)[21]
3 రాజ సిరి సివమక సద (అమరావతి)[22]

వడ్డమాను, అమరావతి నాణెముల మీద, హైదరాబాదులోని న్యూమిస్‌మాటిక్ సొసైటీ వారు ప్రచురించిన నాణెముల వలన ఈ క్రింది రాజులు తెలుస్తున్నారు.

| | |
|---|---|
| మహాసద<br>రాజ సిరిసివ మకసద<br>అసకసద | వడ్డమాను |
| అయిర అసకసద | అమరావతి[23] |
| రాజ సిరిమహాసద<br>రాజ సివసద<br>సదస<br>రాజ సిరిసివ మకసద | హైదరాబాదు |

ప్రస్తుతం మనకు తెలిసినంత వరకు ఈ రాజుల యొక్క పాలనా క్రమం తెలియదు అయినప్పటికి శాసనాల్లో లభించే రాజులు అదే పేర్లతో నాణెములను ముద్రించిన రాజులు ఒక్కరే అయి ఉంటారనిపిస్తుంది

ఖారవేలుడు మహారాజుగాను, మహామేఘవాహనుడు గాను, కళింగాధిపతి గాను ఉదహరింపబడటం తెలిసిందే అయిర అని గూడ ఉదహరింపబడ్డాడు కాని ఈయనకు పై రాజులకు ఉన్న సంబంధం తెలియదు. వీరిలో ఒకరైన సిరిసద మహామేఘవాహన కుటుంబం వాడినని, కళింగ - మహిషక దేశాలు రెంటికి అధిపతినని చెప్పుకున్నాడు వేల్పూరు శాసనంలోని మా(న)సద సద వంశజుడే అయి ఉంటాడు అయితే మహామేఘవాహనుడని గాని, కళింగ మహిషకాధిపతి యని గాని చెప్పబడలేదు అయిర అన్న గౌరవ వాచకం, మహారాజ పదం ఉపయోగింపబడినవి. దీనికి కారణం రెండు విధాలుగా చెప్పవచ్చు. ఆయన కాలానికి పైరెండు రాజ్యాలు ఒకటిగా సంఘటితమవటం వలన ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం కలగక పోవచ్చు. లేదా కళింగ రాజ్యభూభాగాన్ని

పోగొట్టుకొని ఉంటారు మరొక విధంగా కూడ జరిగి ఉండవచ్చు గుంటుపల్లి శాసనకర్త రాజలేఖకుడు కావటం వలన రాజనామాన్ని ఉదహరించటంలో ఉన్న సాంప్రదాయాన్ని యథాతథంగా పాటించి రాజ్యాన్ని, బిరుద, వంశనామాలను పొందుపరచి ఉంటాడు వేల్పూరు శాసనకర్త అయిన రాజసేవిక దీపధారిణి కావటంవలన ఈ సాంప్రదాయాన్ని పాటింపాలన్న అవగాహన లేక తనను అప్పటి మహాజునకు రాజదీపధారిణిగా చెప్పుకుంటూ కేవలం ఆనాటి మహా రాజును ఉదహరించి ఉంటుంది ఈ రాజులు తమను సదకుటుంబీకులుగా చెప్పుకున్నారు. సిరిసాతవాహన, శ్రీగుప్తులు ఆయా రాజ వంశాలకు మూల పురుషులైనట్లే సిరిసద గూడ సద కుటుంబానికి మూలపురుషుడని భావించ వచ్చు.

ఖారవేలుడు తన నాణెములను ముద్రించినట్లు కనపడదు ఒరిస్సా ప్రాంతంలో లభించిన మొట్టమొదటి నాణెములు పూరికుషానులవే. క్రీ శ. మొదటి శతాబ్దంలో కుషానుల సామంతులు ఈ ప్రాంతాన్ని తమ అధీనంలోకి తెచ్చుకున్నప్పుడు ఈ నాణెములను ప్రవేశపెట్టి ఉంటారు హాతీగుంఫా శాసనం వల్ల తెలిసే కోస్తాతీరం మీద (పిథుండ) ఖారవేలుని దండయాత్ర ఎటువంటి శాశ్వత ప్రభావాన్ని కలిగించని ఒక తాత్కాలిక సంఘటనగా భావించవచ్చు. కాని అతని తరువాత వచ్చిన కళింగాధిపతులు - ఎన్ని తరాల తర్వాత వారన్నది తెలియదు - తమ రాజ్యవిస్తరణను సంఘటితం చేసుకొని కళింగ - మహిషక రెండు భూభాగాలమీద తమయొక్క ఆధిపత్యాన్ని ప్రకటించు కున్నారు. అయితే మహిషక భూభాగం ఏది? దీన్ని గుర్తించటంలో అభిప్రాయ భేదాలున్నవి కాని శాసనాధారాలు గుంటుపల్లి కొండలను నాగపర్వతంగా సూచిస్తవి. అందువలన దాని పరిసర ప్రాంతం కృష్ణా పరీవాహక ప్రాంతం గోదావరి వరకు విస్తరించిన తీరప్రాంతం నాగభూమిగా గుర్తించవచ్చు. అటువంటప్పుడు దానికి పశ్చిమాన ఉన్న ప్రస్తుత నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాల ప్రాంతాన్ని పల్లవబొగ్గకు (పల్నాడుకు) ఉత్తరంగా ఉన్నదానిని మహిషక దేశంగా గుర్తించవచ్చు.

ఈ సద పాలకులు మహిషక దేశాన్ని ఆక్రమించుకున్న సందర్భంలో తమ రాజ్యంలోని ఉత్కళభూభాగాన్ని పూరికుషానులకు పోగొట్టుకొని ఉంటారు.

కళింగ - మహిషక భూభాగంలో స్థిరపడి ఉంటారు దీనికి కేంద్ర స్థానంలో ఉన్న ధాన్యకటక పట్టణం వారి ముఖ్యనగరమై ఉండవచ్చు అమరావతి-ధరణి కోట పరిసరాల్లోని వారి నాణె సాంద్రతను బట్టి ఈ విధంగా ఊహించవచ్చు. ఈ మధ్య ధరణికోట పురావస్తు త్రవ్వకాలలో కొత్తగా లభించిన అమెథిస్ట్ (లేక వంగపండు రంగులో ఉండే గజు) ముద్రిక దీన్ని బలపరుస్తుంది ఈ ముద్రమీద కుడివైపు తిరిగికు వెనుక కాళ్ళమీద కూర్చున్న సింహపుగుర్తు (సద నాణెములమీద కనుపించు మాదిరిగా), దానికి ముందు భాగంలో చెట్టు, చతురస్రపు వేదిక ఉన్నవి. సింహం కోస్తా జిల్లాలలోని ప్రజలయొక్క జాతి చిహ్నం (Totem Symbol)గా కనుపిస్తుంది దీనినే ఈ ప్రాంతపు పాలకులు ప్రాచీన కాలంనుంచి విష్ణుకుండినులు, తూర్పు చాళుక్యులవరకు తమ నాణెముల మీద పొందుపరచారు. వారి కట్టడాలలోను, నిర్మాణాలలోను ఉపయోగించుకున్నారు ఇదే "సింహ విష్ణు" రూపాంతరంలో దైవత్వాన్ని పొంది కొండ మోటు మరికొన్ని యితర ప్రాంతాలలో లభించిన పలకములమీద చోటు చేసుకున్నట్లు తెలుస్తుంది. అందువలన వీరే కోస్తా ప్రాంతంలో సాతవాహనులు ప్రవేశించేవరకు పాలించిన రాజ వంశం వారని తెలుస్తుంది

వీరిని ఒక వరుసక్రమంలో నిర్ధారించేటప్పుడు చివరి రాజు సివమక సదగా చెప్పవచ్చు. ఎందువలననంటే అమరావతిలో లభించిన అతని లేఖనం లోని లిపీ, వాసిష్ఠిపుత్ర పుళుమావి లెఖనంలోని లిపీ పరస్పరం సమకాలాన్ని సూచిస్తవి గనుక. బహుశ వాసిష్ఠీ పుత్ర పుళుమావి ఇతనిని రాజ్యచ్యుతుణ్ణి చేసి సాతవాహన రాజ్యాన్ని స్థాపించియుంటాడు ఇతడు తనను "సివమక సద"గా ఉదహరించుకున్నాడు. అంటే శివుని కుమారుడు సద అని 'మక' అన్న తెలుగు పదానికి అర్థం కుమారుడు అని కనుక యితని తండ్రి శివసద. ఈయన నాణెములు గూడా 'రాజ్ఞో శివసద' అన్న లేఖనంతో రాజారెడ్డి, సూర్యనారాయణరెడ్డి ప్రకటించిన వానిలో ఉన్నవి.[24]

శివసదకు ముందు రాజు వడ్డమానునాణెముల వలన, అమరావతి నాణెము వలన తెలిసే "అయిర అసకసద" అయి ఉంటాడు అతనికి పూర్వీకుడు వేల్పూరు శాసనంలోని అయిర మా(స)సద. ఇతని నాణెములు (మహా సద పేరుతో) కూడా వడ్డమానులో లభించినవి. వేల్పూరు శాసనంలోని

మా(న)సద వడ్డమాను నాణెములమీది మహాసద ఒక్కడే. వేల్పూరు శాసనంలో మ - సదగా సర్కారు గుర్తించారు. మ తరువాత అక్షరం స్ఫుటంగా కనుపించని కారణం చేత ఆ ఖాళీని 'న' అక్షరంతో పూరించి మాన సదగా చదివారు కాని నేటి వడ్డమాను నాణెముల మీది లేఖనంలో మహా సద అని స్పష్టంగా ఉండటం వల్ల వేల్పూరు శాసనంలో గూడ మహాసద అనియే ఉంటుందని అనుకొన వచ్చు- ఈయనే ధాన్యకటకాన్ని తన పాలనా కేంద్రంగా చేసుకొని ఉంటాడు. వేల్పూరు శాసనం మీద వ్యాఖ్యానం చేస్తూ డా॥ దినేష్‌చంద్ర సర్కారు ఈ సదపాలకులు తీరాంధ్రంలో సాతవాహనులకు ముందు కాలానికి వాసిష్ఠీ పుత్ర పులుమావికి పూర్వం నిర్ణయించవలసిన వారని అభిప్రాయం వెలిబుచ్చారు

'సద' లేక 'సిరిసద' లేఖనంతో (అక్షరాలు నాణెపు భాగం మీదనుంచి తప్పిపోకుండా పూర్తి లేఖనంతో) ఉన్న నాణెములు గుంటుపల్లి శాసనంలోని సిరిసద నాణెములుగా భావించవచ్చు రాజారెడ్డి-సూర్యనారాయణరెడ్డి ప్రకటిం చిన నాణెములలోని ఈ రాజు నాణెములు అమరావతి, ధరణికోట, వడ్డమాను ప్రాంతాలనుంచి లభించినట్లు ఉదహరించ లేదు-బహుశ ఇతని పాలనా కేంద్రం కళింగనగరంలోనే ఉండి ఉంటుంది

దాదాపు యేడు తరాల పాటు సాతవాహన రాజులు ధాన్యకటకంలో సార్వభౌమాధికారం నెరపినవారవటం చేత, వారి తరువాతి కాలంలో రాజకీయ పరిస్థితులు సంఘర్షణలతో, ఇక్ష్వాకులు, పల్లవులు, కాంధారులు, విష్ణుకుండి నులు మొదలైనవారిమధ్య - వారివారి శాసనాలలో కనపడేవిధంగా - ధాన్య కటక ప్రాంతం కల్లోల వాతావరణంతో ఉన్న కారణంచేత, ఈ సదరాజ వంశం, దాదాపు ఆయిదు తరాల చరిత్ర గలదై సుమారు ఒక శతాబ్దానికి పైగా కాలం వ్యాప్తి చెందిన దానిని సాతవాహనుల తరువాతి కాలంలో యిముడ్చ లేము కనుక వీరిని కోస్తా ఆంధ్రలో సాతవాహనులకు వాసిష్ఠీపుత్ర పులుమావి (క్రీ శ. 130-59) కి పూర్వీకులుగానే నిర్ణయించవలసి ఉంటుంది.

అందువలన వీరి యొక్క రాజ్యక్రమానుగతి మౌర్యుల పతనానంతరం సాతవాహనుల పాలన ప్రారంభం వరకు మధ్యనున్న రాజకీయ వాతావర ణంలో ఈక్రింది విధంగా నిర్ణయించవలసి ఉంటుంది:

1. కళింగాధిపతి మహా మేఘవాహన, మహారాజ అయిర ఖారవేలుడు
2. అతనికి సమకాలీనులుగా భట్టిప్రోలు ప్రాంతంలో రాజకుబేరకుడు, వడ్డమాను ప్రాంతంలో రాజసోమకుడు
3 అమరావతిలో కుమార సమ్మలియ, అవతకాములు, పెదవేగిలో రాజ కికీచకుడు.
4. కళింగ - మహిషకాధిపతి మహా మేఘవాహన, మహారాజ సిరిసద (సదవంశ ప్రారంభకుడు.)
5. మహారాజ అయిర మహాసద - ధాన్యకటక ప్రాంతంలో.
6 అయిర అసక సద
7 రాజ సివసద
8 రాజ సివమక సద
9. వాసిష్ఠీపుత్ర పులుమావి - సాతవాహన వంశస్థుడు - సదవంశ నిర్మూల కుడు

పైన ఉదహరించిన వంశానుక్రమం పూర్తిగా తాత్కాలికం ముందు ముందు జరిగే పరిశోధనలవలన ముఖ్యంగా సదరాజవంశీకుల పరుసక్రమంలో మార్పుచేర్పులకు అవకాశం ఉంది. వీరి కాలపు మత- సాంఘిక- ఆర్థిక పరిస్థితులను గూర్చి తగిన అంచనా వేయవలసి ఉంది

మరొక ముఖ్యమైన గమనిక సర్కారుగారు సూచించిన విధంగా[25] మహా రాజపదం సాతవాహనులకన్న ఖారవేలుడు, సిరిసదలకు కనుపిస్తూన్న విధంగా, కళింగ పాలకులైన చేది మహామేఘవాహనులకే ఎక్కువగా వాడుకలో ఉంది. మహా సద మహారాజునని చెప్పుకోవటం అతడు గూడ మేఘవాహన, సదవంశానికి చెందినవాడేనని సూచిస్తుంది అయితే ఖారవేలునితోగాని, సిరిసదతోగాని ఇతనికున్న బాంధవ్యం ఏమిటో తెలియదు. ఈ మహారాజపదం సదవంశీయుల సార్వభౌమాధికారాన్ని తెలియజేస్తుంది. ఖారవేలుని దండయాత్ర ఫలితంగానే సదవంశీయుల పాలన మహిషక దేశానికి వ్యాపించి ఉండవచ్చు. చివరకు వీరు కృష్ణా - గుంటూరు ప్రాంతంలో ధాన్యకటకం పాలనా కేంద్రంగా చేసుకొని తమ పాలనాధికారాన్ని - వారి నాణెముల ఉనికివల్ల తెలుస్తున్నట్లుగా (ముఖలింగం

నుంచి పడుగుపాడువరకు)- ఉత్తరాన కళింగం నుంచి దక్షిణాన నెల్లూరువరకు విస్తరింపజేసుకొని ఉంటారు ఒరిస్సాలోని తమ భూభాగాన్ని పూరికుషానులకు పోగొట్టుకున్నప్పుడు తీరాంధ్రంలో తెలుగువారుగానే స్థిరపడి ఉంటారు

మరొక విషయంవల్ల గూడ యిది తెలుస్తుంది. గుంటువల్లి శాసనంవల్ల సిరిసద, మేఘవాహన కుటుంబీకుడని తెలుస్తోంది వీరు చేది వంశస్థులు తరువాత వచ్చిన సదరాజులు సిరిసద కుటుంబంవారే. కనుక వీరంతా చేది వంశస్థులు ఆంధ్రేతర ప్రాంతంవారు కాని కృష్ణా-గుంటూరు ప్రాంతంలో స్థిరపడ్డారు వీరిలో చివరివాడు, వాసిష్ఠీపుత్ర పులుమావికి ముందు వాడు అయిన రాజు తన పేరులో పితృ పూర్వకపదం 'శివమక' అంటే శివుని కుమారుడు అని 'మక' అన్న తెలుగు పదం ఉపయోగించి తాము కూడా తెలుగువారమే నన్నట్లు, స్థానికులతో ఒక్కటేనన్నట్లు తెలియపరచాడు ఇది వారు స్థానికులతో ఒకటిగా కలిసి పోవలెనని చేసిన ప్రయత్నంగా కనిపిస్తుంది. అయితే, పితృపూర్వక పదం ఉపయోగించటం ఆంధ్రేతర సాంప్రదాయం. ముఖ్యంగా పశ్చిమాన ఉన్న విదేశీయులైన శకులలో ఈ విధానం కనపడుతుంది. వీరిపట్ల స్థానిక సమాజంలో ఒక విముఖత ఉండి ఉంటుంది [26] కాని ఇతని తరువాతవాడైన వాసిష్ఠీపుత్ర పులుమావి తన ప్రత్యర్థి అయిన శివమకసదకు భిన్నంగా సాంప్రదాయకమైన మాతృపూర్వక పదం వాసిష్ఠిపుత్ర అన్న అర్థంలో పూర్తి తెలుగు లేఖనాన్ని[27] "అరహణకు వాహిట్టి మాకనకు తిరుపులుమావికు" అని పొందుపరుస్తూ ద్విభాషా లేఖనాలతో తన వెండి రూపాకృతి నాణెములను ముద్రించాడు. ఈ ముద్రించటం యాదాలాపంగా కాక ఒక ప్రయోజనాన్ని ఆశించి చేసినట్లు కనపడుతుంది. తన సామ్రాజ్యంలో తూర్పు పశ్చిమ ప్రాంతాల మీద అధికార ప్రాబల్యంకోసం పెనుగులాడుతున్న విదేశీయులకు వ్యతిరేకంగా తన ప్రజలకు తాను వారి యొక్క స్వజాతీయ పాలకుడనని చెప్పుకోవటంగా కనిపిస్తుంది.

భావి పరిశోధనల వలన మరికొంత కొత్త సమాచారం వెలుగులోకి వస్తే ప్రస్తుతం వెలిబుచ్చిన అభిప్రాయాలకు మార్పులు చేర్పులు రావచ్చు. దీన్ని గూర్చి పండితులు పరిశోధించవలసి ఉంది.

**జ్ఞాపికలు :**


1. డి సి. సర్కారు సెలెక్టు ఇన్‌స్క్రిప్షన్స్ : వాల్యూం 1 (ఢిల్లీ 1986) పు 219.
2. దానిలోనే పు 227.
3. టి.వి జి. శాస్త్రి: "ఎక్స్కవేషన్స్ ఎట్ వడ్డమాను" బిర్లా ఆర్క్యాలాజికల్ అండ్ కల్చరల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్, (హైదరాబాదు 1983) పు 16.
4. ఎ. ఘోష్ · "ఎర్లీ ఇన్‌స్క్రిప్షన్స్ ఫ్రమ్ అమరావతి - సౌత్ ఈస్ట్ ఇండియా". ఎన్సెంట్ సిలోన్ నం 3 (ఆగస్టు 1970) పు 101-105
5. జాస్ బర్గెస్ : ది బుద్ధిస్ట్ స్తూపాస్ ఆఫ్ అమరావతి అండ్ జగ్గయ్యపేట. ఎయస్‌యస్ఐ నం 1 (వారణాసి 1970) ప్లే LVI
6. వ్యక్తిగతంగా తెలుసుకొన్నది త్రవ్వకాలు జరుగుతున్నప్పుడు దర్శించి.
7. ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూం XXXII (1957) పు 82 తర్వాత.
8. ఆర్. సుబ్రహ్మణ్యం "ది గుంటుపల్లి బ్రాహ్మి ఇన్‌స్క్రిప్షన్ ఆఫ్ ఖారవేల" ఎ పి. గవర్నమెంటు ఎపిగ్రాఫికల్ సీరీస్ నం. 3 (హైద్రాబాదు 1968) పు 2.
9. పండితులు ఈ ప్రదేశాన్ని వివిధ రకాలుగా చదివారు · ఋషికనగరం. ఇ సేనార్ట్-ఎ ఇం. 8 (1905-06) పు. 62; ముషికనగరం (జయస్వాల్ అండ్ బెనర్జి- పైదానిలోనే పు. 72) మరియు అసికనగరం (డి.సి. సర్కారు తన పుస్తకం-పైన ఉదహరించిన దానిలో పుట 207).
10. పిథుండను గుంటుపల్లిగా గుర్తించారు (ఆర్. సుబ్రహ్మణ్యం పైన పేర్కొన్నది) భట్టిప్రోలుగా (బియస్‌యల్ హనుమంతరావు - అర్హత వచన్ వాల్యూం 2 (3) ఇండోర్ జూన్ 1990) పు. 39-45. "వర్ధమానీయ విహార - మహామేఘ వాహన."
11. ఐ.కె శర్మ : కాయినేజ్ ఆఫ్ ది సాతవాహన ఎంపైర్. (ఢిల్లీ 1980) పు 41.

12. ఇ జె రాప్సన్ · కేటలాగ్ ఆఫ్ ది కాయిన్స్ ఆఫ్ ది ఆంధ్ర డైనాస్టీ మొ॥ (బియంసి), (న్యూఢిల్లీ 1975) పు. 10, 11 & 24 ఒక నాణెం మీద 'న'కు బదులుగా 'ద' చదివి లేఖనాన్ని నదసగా సూచిస్తారు. (పు. 10 చూడండి)

13 యం. రామారావు : సాతవాహన కాయిన్స్ ఇన్ ది ఆం. ప్ర గ. మ్యూజియం 1961 - పు. 39 (కాయిన్ నం 95)
ఎ న్యూ లెడ్ కాయిన్ ఫ్రం అమరావతి. జెఎహెచ్‌సి వాల్యూం 1. పుట. 92 (1942)
పి ఎల్. గుప్త "ది కాయినేజ్ ఆఫ్ ది సాతవాహనాస్-ట్రైప్స్ అండ్ దెయిర్ రీజయినల్ డిస్ట్రిబ్యూషన్" -కాయినేజ్ ఆఫ్ ది శాతవాహనాస్ అండ్ కాయిన్స్ ఫ్రం ఎక్స్కవేషన్స్-లో ఎడి ఎ యం. శాస్త్రి (నాగ పూరు, 1972) పు. 51.
ఐ కె. శర్మ పైన ఉదహరించినది. పుట. 225 & 256. ప్లే. XII

14 కె గోపాలాచారి . ది ఎర్లీ హిస్టరీ ఆఫ్ ది ఆంధ్రా కంట్రీ - మద్రాస్ 1976 పు 10-17.

15. యం. కస్తూరిబాయి · "కాయిన్స్ ఫ్రం వడ్డమాను ఎక్స్కవేషన్స్" న్యూమిస్‌మాటిక్స్ అండ్ ఆర్కియాలజీ - రెండవ అంతర్జాతీయ కొలెక్వియం - పు 102 - 112.

16 డి రాజారెడ్డి & పి సూర్యనారాయణరెడ్డి : కాయిన్స్ ఆఫ్ ది మేఘ వాహన డైనాస్టీ ఆఫ్ కోస్టల్ ఆంధ్ర (హైద 1985.)

17. ఐ.కె.శర్మ : పై నుదహరించినది పు. 142 - 143 ప్లే. VIII

18 ఇ.జె రాప్సన్ ,, పు. 24 ప్లే. V. జి.పి. 2 & జి.పి. 3.

19.

20 ఎపి. ఇండి నం XXXII. పు 82 (1957)

21. ఆర్ సుబ్రహ్మణ్యం : పై నుదహరించినది.

22. జాస్ బర్గెస్ :

23. అమరావతి సంగ్రహాలయములో ప్రదర్శితము.

24. ఈ గ్రంథకర్తలు ప్రచురించినదే మరియొక శివ నాణెము నాణెముల పరిణామ రీతిలో సద పరంపరలో ఇముడదు దీనిని ప్రచురించినప్పుడు ఈ ముద్రాపిత రాజప్రతినిధిగా ఒక ప్రాంతాన్ని పాలించేటప్పుడు ముద్రించినట్టిదిగా తోస్తుంది. సదనాణె పరంపరలోనికి రాదు

25. డి.సి. సర్కారు : పై నుదహరించినది పుట. 82 - 83.

26. బి.యం.సి. పు. 72 తరువాత.

27. పి.ఆర్.కె ప్రసాద్ : "ది సిల్వర్ పోర్ట్రైట్ కాయిన్స్ ఆఫ్ ది సాతవాహనాస్" కాయినేజ్ ఆఫ్ ది సాతవాహనాస్ అండ్ కాయిన్స్ ఫ్రం ఎక్స్కవేషన్స్ - ఎడి ఎ యం. శాస్త్రి (నాగపూరు 1972 )

—. ೦ :—

# 4. క్రీ. శ. ఆరవ శతాబ్దిలోని తెలుఁగు కవిత

—చీమకుర్తి శేషగిరిరావు

ఆంధ్ర సాహిత్య చరిత్ర రచయితలలో ప్రామాణికుడుగ లెక్కకు వచ్చిన పింగళి లక్ష్మీకాంతం, తెలుగుభాషలో కవిత్వపు ఆరంభదశను గురించి వ్రాయుచు "ఆశువుగ పుట్టిన పాటలు, పదాలు గాలిలో కలిసిపోవుచుండ నిలుపు కొనదగిన శక్తిలేక నిర్విణ్ణమై వెచ్చనూర్చుడు కాలము పుచ్చుచుండిన తెనుగు చాళుక్యరాజుల ఆదరముచే, అందును గుణగ విజయాదిత్యుని చేయూతచే, పద్య రూపముదాల్చి ఆనాటి తెలుగువారికి కనువిందొనర్చినది "[1]

ప్రముఖ చారిత్రక పరిశోధకుడు, రచయిత నేలటూరి వెంకటరమణయ్య తెలుగు కవిత్వమును గురించి వ్రాయుచు "కర్ణాటకము నుండి వచ్చిన చాళుక్యరాజుల ప్రోత్సాహమున దెనుగున కావ్యనిర్మాణమునకు గడగిన తెనుగు కవులు కర్ణాటక ఫక్కిని అనుసరింపక తప్పినదికాదు."[2]

పై వారిలో తొలుతటి పండితునకు బహుశః నన్నెచోడుని—

మునుమార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గున నిలిపి రంధ్ర విషయంబున
జన చాళుక్యరాజు మొదలగు బలువుర్

అనునది పరమప్రమాణమై ఉండవచ్చును.

---

1. ఆంధ్ర సాహిత్య చరిత్ర, 1979, పుట 18.
2. పల్లవులు చాళుక్యులు, 1969, పుట 242.

ఇక రెండవపండితుడు చాళుక్యులు కన్నడదేశమునుంచి వచ్చుటవే తెలుగున కావ్య నిర్మాణమునకు కన్నడ కవిత్వము స్ఫూర్తి కల్గించినదని భావించెను ఇటుల తెలుగు కవిత్వమునకు స్ఫూర్తినిచ్చినవి సంస్కృత, కర్ణాటక కవిత్వములను అభిప్రాయము ఏర్పడి, గతానుగతికముగ పండితలోకమున ధ్రువపడినది

తెలుగు కవిత్వమున ఆదరణను ఆర్జించిన శార్దూల, చంపకమాల, ఉత్పలమాలాదులు సంస్కృత కవిత్వమునుండి తెలుగులోనికి వచ్చినవనుట సుస్పష్టము, యతి విషయమున మాత్రము తెలుగు కవులు మార్పును కొని వచ్చిరి. ఇక జాత్యుపజాతుల విషయమున 'అక్కర' కన్నడ ఛందస్సునుండి వచ్చినదనుటయు యథార్థమే. కాని జాత్యుపజాతులకు చెందిన సీస, గీత, తరువోజల సంగతి? ఇవి కన్నడ ఛందస్సున లేవు, సంస్కృతమున కనరావు, తెలుగున గుణగవిజయాదిత్యుని కాలమునాటి క్రీ. శ. 850 ప్రాంతపు అద్దంకి శాసనమున తరువోజ, ఇక దాని తరువాత దాదాపు ముప్పది సంవత్సరముల లోపున వెలువడిన ధర్మవరపు శాసనమున సీస గీతపద్యములు కన్పడు చున్నవి కన్నడమున, సంస్కృతమున కన్పడని ఈ ఛందోరీతులను ఎవరు, ఏ కాలమున తెలుగు కవిత్వమున ప్రవేశపెట్టిరి? చాళుక్యులు ప్రవేశపెట్టిరనుటకు అవకాశమే లేదు. వారు సంస్కృత భాషను దేశికన్న ఎక్కువగ తొలుత అభిమానించిరి వారి ఆస్థానమునందలి పండితులే ఈ ఛందోరీతులను ప్రవేశపెట్టినచో సంస్కృతపు పేరులే వానికి కల్పించెడివారు సీసము, తరువోజ అనునవి సంస్కృత పదములు కావు దేశి పదములును కావు ఇక ఆ పేరులు ప్రాకృతమునకు చెందినవనియే కావలెను కారణము సుస్పష్టము. సంస్కృతము తెలుగుదేశమున కాలిడునాటికి, ఇచట ప్రాభవముతో మనినవి ప్రాకృత భాషలే కనుక ఈ నిర్ణయము సహేతుకము

అయిన యెడల చాళుక్యులు తెలుగు దేశమున కాలిడునాటికి అనగా క్రీ.శ. ఏడవ శతాబ్దికి పూర్వమే కొన్ని ఛందోరీతులు - తెలుగున మాత్రమే కననగునవి - ఇచట వ్యాప్తిలో ఉండి తీరవలెను గదా! ఆ ఛందోరీతులను వాడుకొని కావ్యములును రూపొందియుండును ఇటుల లక్ష్యములగు కావ్యములు ఉన్నపుడు అప్పటి లక్షణ గ్రంథములలో ఈ ఛందోరీతుల ప్రసక్తి ఉండియుండును గదా! కాని ఆ యుగపు ప్రాకృత లక్షణ గ్రంథములు ఏవియు మనకు

లభింపకున్నవి సంస్కృతపు వ్యాప్తితో అవి లుప్తములైనవి - కాని ఆ కాల మున తెలుగుదేశమున వెలువడిన ఒక ఛందో విషయక గ్రంథము ఈనాటికిని ఉపలబ్ధమగుచున్నది అందు సంస్కృతపు ఛందోరీతులేగాక, సంస్కృతమున కనరాని కొన్ని జాత్యుపజాతుల లక్షణములును, పేరులును ఈయబడినవి ఆ గ్రంథమే 'జనాశ్రయ ఛందోవిచితిః' దాని రచయిత 'జనాశ్రయ' బిరుదము వహించిన మాధవవర్మ అను విష్ణుకుండిన వంశీయ ప్రభువు, ఆరవ శతాబ్దా నికి చెందిన వాడు. ఆతడు ఆనాటి తెలుగుదేశపు పాలకుడు.

మాధవవర్మ రచించిన గ్రంథమునకు, అతని ఆస్థాన పండితుడగు గుణస్వామి వ్యాఖ్యానమును రచించెను. ఈ గ్రంథమున అయిదవ అధ్యాయ మున జాత్యుపజాతుల ఛందోరీతులు వివరింపబడినవి. ఆ అధ్యాయమునందలి ఏబదియన సూత్రము.

'శీర్షకం గీతికాపరా'

దానిపై వ్యాఖ్యాత చెప్పినది:

'సైవాధికాక్షరా గీతికాపరా భవతిచేత్ శీర్షకం నామ భవతి'

'అధిరాక్షర' అనగా పంచగణములకు మించిన అక్షరములున్న పాదము కలదియని అంతకు పూర్వమున్న సూత్రముల వలన అర్థమగుచున్నది. ఇట్టి దానికి చివరన గీతపద్యము ఉన్నచో ఆ మొత్తపు రచనకు 'శీర్షక' అను పేరుకలదు - అని ఆ సూత్రపు అర్థము శీర్షకము సంస్కృతమున లేదు, ప్రాకృతమున కన్పడదు కావున దేశియగు తెలుగున ఉండుట చేతనే, తెలుగు దేశపు ప్రభువు తాను రచించిన గ్రంథమున దానిని పేర్కొనెను.

'శీర్షక' అను పదము 'శీర్ష' అనుదానికి 'కప్' ప్రత్యయము చేర్చుట వలన ఏర్పడినది 'శీర్ష' పదపు ప్రాకృతరూపము 'సీస' తెలుగు కవిత్వ మున ఒక ఛందోరీతికి 'సీస' అను ప్రాకృత నామము ఏర్పడగ దానిని వివ రించు సంస్కృత గ్రంథకర్త దానిని 'శీర్షక' అని పేర్కొనెననుట ఇందు వలన విదితము ఛందోరీతుల ప్రాకృత నామములను అనేకములను గ్రంథకర్త

సంస్కృతీకరించెను అటుల చేయుటకు వీలుపడనివానిని యథాతథముగ ఉంచె ననుటకు ఈ అయిదవ అధ్యాయమున నిదర్శనములు కలవు అందు పేర్కొన బడిన 'నకుక్కుట' వంటివి అట్టివియే.

క్రీ శ. ఆరవ శతాబ్దికి పూర్వమున తెలుగున కవిత్వము ఉండెననుటకు 'ప్రపంచసూదని'అను పాళీగ్రంథమున సాక్ష్యము లభించుచున్నది ఆ గ్రంథపు రచయిత యగు బుద్ధఘోషుడు (క్రీ శ 500 ల ప్రాంతము) ఆ గ్రంథపు ఉపోద్ఘాతమున - తన కాలము పిటకములకు అంధక, దమిళ భాషలలో అను వాదములు ఉన్నటు తెలిపెను ఈ అంధకమే ఆంధ్రభాష ఆ అంధక భాషలో పిటకానువాదములే కాదు, కొన్ని కావ్యములును సీసము మొదలగు దేశీయపు ఛందోరీతులలో రచింపబడి ఉండును అవి బౌద్ధ మతమునకు చెందినవగుట వలన బౌద్ధమతము లుప్తమగుటతో అవియు అంతరించినవి

'జనాశ్రయ ఛందోవిచితిః' యందు గణముల పేరులు పింగళుని వైది కపు ఛందశ్శాస్త్రమును అనుసరించినవి ఇప్పటి య, మ, త, ర, జ, భ, న, స, గణములుగాని, ఇంద్ర సూర్య గణములుగాని అందు కనబడవు కావున ఆ గ్రంథమునందలి పారిభాషికత వేరొకత్రోవన నడచినది దానిని అర్థముచేసికొని చదివినచో క్రీ. శ ఆరవ శతాబ్దికి పూర్వమే రూపొందిన తెలుగు కవిత్వపు లక్షణములను మనము తెలిసికొన వచ్చును పరిశోధకులు ఆ కృషిని మున్ముందు సాగింపగలరని ఆశింపదగును

—: o :—

# 5. మల్లియ రేచన – మొదటి తెలుగు రచయిత

## —పుచ్చా వాసుదేవ పరబ్రహ్మ శాస్త్రి

తెలుగు ఛందో గ్రంథములలో కవిజనాశ్రయము ప్రాచీన మైనదిగా పరిశోధకులు భావించుచున్నారు దీని కర్తృత్వమును, కాలమును గూర్చి రెండు వాదములు గలవు ఇప్పుడు కవిజనాశ్రయ ప్రతులు రెండు ఉపలబ్ధమగు చున్నవి. జయంతి రామయ్యపంతులు కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్తున 1917లో మొదట ప్రచురించిన దొకటి, నిడుదవోలు వెంకటరావు విపులమగు పీఠికతో 1950 లో వావిళ్ళ వారి ద్వారా ప్రచురించినది రెండవది. ఇందులో మొదటి దానికి జయంతి రామయ్య పంతులు పీఠిక వ్రాయుచు కవిజనాశ్రయ కర్త వేములవాడ భీమకవి యని నిర్ధారించెను ఈ భీమకవిని శ్రీనాథుడు స్మరించి యుండుట కనవచ్చును 'వచియింతు వేములవాడ భీమన భంగి నుద్దండ లీల నొక్కొక్కమాటు' (కాశీ. అవ.) అని యుండుటనుబట్టి వేముల వాడ భీమన శ్రీనాథునకు అనగా క్రీ శ. 14 వ శతాబ్దాంతానికి కొంత ముందు వాడై యుండవలెనని చెప్పవలెను. కాని శ్రీనాథుడు వేములవాడ భీమన కవి జనాశ్రయము రచించెనని చెప్పలేదు. క్రీ శ. 17 వ శతాబ్దమువాడైన అప్పకవి యీ విధముగా చెప్పెను

> "వికటకవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమునఁ గలిపినారు
> వానిఁగ్రైకొనంగవల దప్రయుక్తములేల సెప్ప భీముఁడెఱిఁగి యెఱిఁగి"
>
> (అప్ప. తృతీయ. పద్యము 270)

కనుక అప్పకవి నాటికి కవిజనాశ్రయమును భీమకవి రచించినట్లు పండిత లోకమున ప్రచలితమగుచుండెనని తెలియుచున్నది కాని దానిలో వికటకవులు కొన్ని వింతలు చేర్చినట్లుగా కూడ తెలియుచున్నది. వేములవాడ భీమకవి

కర్తృత్వాన్ని బలపరిచే బహిరంగ సాక్ష్యమిది ఇంక అంతరంగ సాక్ష్యముగా గ్రంధములోనిదేనని చెప్పదగ్గ వేరే సాక్ష్యములేదు ప్రక్షిప్త పారంగా ఒకే వ్రాత ప్రతిలో కనుపించు కొన్ని అధికమగు అవతారిక పద్యములు జయంతివారి ప్రతిలో జేర్చబడినవి అందున్న ఆరు పద్యములలో—

కం వేములవాడను వెలసిన
భీమేశ్వరు కరుణగల్గు భీమసుకవి నేఁ
గోమటి రేచన మీదను
సీమహి గవులెన్న ఛందమెలమి రచింతున్.

కం. నిను నీవె పొగడు వైఖరి
నొనరించెదఁ దెనుగుబాస నొప్పగ ఛందం
బును గనక కవిత చెప్పిన
వినవే లచ్చనమువాడు వెంగలి రేచా!

కం. ఆ చంద్ర తారకంబుగ
భూచక్రములోన సుకవిపూజితమగుచున్
ఏ ఛంద మమరుచుండును
నా ఛందము నీదు పేర నమరును రేచా!

ఇత్యాది మఱి మూడు పద్యములు ఆ ప్రక్షిప్తావతారికలో గలవు ఈ పద్యములు గ్రంథములోనివేనని చెప్పదగ్గ సాక్ష్యము లేదు. పైగా శ్రీనాథుని వంటి మహాకవి పొగడ్తకు పాత్రమైన ఉద్దండ లీల యీ పద్యాల్లో కనుపించదు. భీమకవి కోమటి రేచన యిచ్చెడి బహుమానములకు లోబడి తన గ్రంథాన్ని అమ్ముకొంటాడా? అప్పకవి చెప్పినట్లు వికటకవులు కల్పించిన వింతలలో ఈ ప్రక్షిప్తావతారిక పద్యాలు గూడ గలవా? అంటే అప్పకవినాటికే కవిజనాశ్రయ కర్తృత్వంలో కూడ మార్పు వచ్చియుండెనా? అనే సందేహములు కలుగు చున్నవి. ఈ అంతరంగ సాక్ష్యాన్ని యథాతథముగా స్వీకరించ వీలుగాకున్నది.

ఇంక రెండవ పక్షమున మల్లియ రేచనయే కవిజనాశ్రయము రచించెను ఈ వాదాన్ని వేటూరి ప్రభాకర శాస్త్రి (రాజరాజనరేంద్ర సంచిక), నిడుద

వోలు వెంకటరావు పరిశోధించి నిర్ణయించిరి రేచన కాలము కనీసము క్రీ.శ 12వ శతాబ్దికి పూర్వమై యుండునని చెప్పిరి ఈ వాదమును బలపరచు నట్టి అంతరంగ సాక్ష్యములు రెండు మూడు, గ్రంధములో నున్నట్లు నాకు కనుపించుచున్నవి ఈ గ్రంథ రచయిత శ్రావకాభరణుడు అంటే జైన మతాను యాయి వాదీంద్ర చూడామణి యను బిరుదు వహించిన ఒక జైన విద్వాంసు నకు శిష్యుడును, కవిజనాశ్రయ బిరుదనామధారియు నగు నొక శ్రావకాభరణుడు దీని రచయితగా అధికరణాంత గద్యములలో చెప్పబడు చున్నది. "ఇది వాదీంద్ర చూడామణి పదసరసీరుహ మధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయంబను ఛందంబునందు సంజ్ఞాధి కారము" కనుక గ్రంధకర్త జైనుడనేది స్పష్టము. ఇంక అవతారిక పద్యాల్లో మొదటిది సరస్వతీ ప్రార్థన. అది జైన సంప్రదాయము. వేఱొక పద్యంలో తను ఒక మిత్రుని సహాయంతో ఈ గ్రంథాన్ని రచించినట్టు చెప్పుకొనును.

కం అసమాన దాన రవితన
యసమానోన్నతుఁడు వాచకాభరణుఁడు ప్రా
ణసమాన మిత్రుఁడీ కృతి
కి సహాయుఁడుగా నుదాత్త కీర్తి ప్రీతిన్

ఇందు అతనికి సహాయము చేసిన మిత్రుని పేరు చెప్పబడలేదు. వాచకా భరణుడు అను బిరుదము మాత్రము చెప్పబడెను. జైన మత ప్రచారకులను వాచకులంటారు అట్టి వాచకులలో శ్రేష్ఠ డొకడు మల్లియ రేచనకు మిత్రుడుగా ఈకృతికి తోడ్పడెనట ఈ వాచకాభరణు డెవరో గుర్తించుటకు యత్నించుదము.

ఇటీవల కరీంనగరు జిల్లాలో జగిత్యాలపోవు రోడ్డుప్రక్కన కుర్క్యాల గ్రామంవద్ద బొమ్మలగుట్ట యను కొండమీద కొన్ని జైనప్రతిమలు, ఒక పెద్ద శాసనము బయల్పడెను కన్నడంలో ఆదికవిగా కీర్తించబడుచున్న పంపమహా కవి సోదరుడు జినవల్లభుడను ఒక జైన విద్వాంసుడీ జైన తీర్థమును కల్పించి, ఆ పెద్ద శాసనమును, జైనప్రతిమలను మలిపించెను. అన్నయగు పంపకవితో

తనుకూడ-వేములవాడ రాజధానిగా క్రీ శ 930-950 మధ్య పాలించిన-రెండవ అరికేసరియను ఒక గొప్ప రాజు ఆస్థానములో విద్వత్కవిగ ఆదరింపబడుచుం డెడివాడు ఈ సోదరుల తాతలనాడు వీరి కుటుంబము తెలుగు దేశంలో గుంటూరు జిల్లా బాపట్ల తాలూకాలోని వంగిపఱ్ఱు గ్రామంలో నివసించుచు, రాజాశ్రయము కొరకు వేములవాడ చాళుక్యరాజగు అరికేసరి ఆస్థానము నలంక రించెను. పైచెప్పిన శాసనం సంస్కృతం, కన్నడం, తెలుగు మూడు భాషలలో వ్రాయబడింది అందు పంపకవియొక్క ఘనత, జినవల్లభునియొక్క ఘనత కీర్తింపబడెను జినవల్లభుడు గొప్పవిద్వాంసుడనియు, మహాదానశీలి యనియు, కవిత్వ తత్త్వ మెఱిగిన మనీషియనియు, వాచకాభరణుడను పొగడ్తకు పాత్రుడనియు కీర్తింపబడెను ఆ వృషభశైల మాతని కీర్తిని చాటుచున్నదట

అజస్రస జిన వన్దనాగత మునీశ్వర శ్రావక ప్రజా స్తవ
రవ ప్రతిధ్వనిత శబ్దకోలాహలైః।
అధిష్ఠిత దిగంబరో వృషభశైల ఏష స్వయం
పరాం వదతి వాచకాభరణ కీర్తి మాకల్పతః॥

ఇందు 'వాచకాభరణు' డని విశేష బిరుదుతో జినవల్లభుడు కీర్తింప బడెను. ఆకాలపు శాసనాల్లోగాని కన్నడ వాఙ్మయంలోగాని 'వాచకాభరణు' డని ప్రసిద్ధి గాంచిన వేఱొక జైన విద్వాంసుడు లేడు. అంతేగాక జినవల్లభుడు కవిత్వతత్త్వ మెరిగినవాడని యీ కన్నడ పద్యంలో కీర్తింపబడెను

'చదుర మయ్మెయ సత్కవిత్వద సన్ద పంపనతమ్మ నా
ర్వదె పొగత్తెయె బాబెస ల్బరెయ ల్కవిత్వద తత్వదొ
ళ్పుదిదు నేర్వడె పేఱలుర్విగ పూర్వమాగిరె బల్గొన
ప్పుదరి నొర్వనె వాగ్వధూవరవల్లభం జినవల్లభం॥'

కవిత్వ తత్త్వమెరిగిన వాచకాభరణుడు జినవల్లభుడు తప్ప వేరొకడు తెలుగుదేశములో ఆ కాలంలో లేడు, తెలుగుదేశంలో వేములవాడ తప్ప వేఱొక

జైన విద్యాకేంద్రము లేదు వేములవాడలో అరికేసరి రాజాశ్రయమున పంప మహాకవి, జినవల్లభుడు, సోమదేవసూరి, ఆతని శిష్యులు అనేక విద్వాంసు లుండువారు. కవిజనాశ్రయ కర్తకు వేములవాడతో సంబంధమున్నదని ప్రతి వాదులు కూడ అంగీకరించిన విషయమే కాకపోతే వేములవాడ భీమకవిని కర్తగా వాదిస్తున్నారు జినవల్లభుడు మహాజన విద్వాంసుడు అట్టి కవిత్వ తత్త్వవేత్త సహాయంతో మల్లియ రేచన తెలుగు ఛందో లక్షణ గ్రంథాన్ని రచించాడు. ఈ శాసనంలో మూడు కందపద్యాలుకూడ గలవు అవియే మొదటి తెలుగు కందపద్యాలని పరిశోధకుల అభిప్రాయము జినవల్లభుడు తెలుగు కవి త్వముగూడ చెప్పనేర్చినవాడు రాష్ట్రకూట రాజుల కాలములో క్రీ శ 9-10 శతాబ్దులలో సంస్కృత జైనవిద్వాంసుల సాంగత్యమున కన్నడమున కవి త్వము చెప్పగల పంపకవివంటి మహాకవులు బయలుదేరిరి. వారి సాంగత్య మున తెలుగులోకూడ కవిత్వము చెప్ప కొంద రుద్యమించిరి ఆంధ్ర భారత రచనలో నన్నయ నారాయణభట్టు సహాయము పొందెను కదా! అట్లే జినవల్ల భుని, అంటే వాచకాభరణుని సహాయముతో మల్లియ రేచన తెలుగు ఛందో లక్షణగ్రంథాన్ని రచించెను.

అప్పటికి లక్ష్యగ్రంథాలుంటే కదా లక్షణగ్రంథ రచనకు పూనుకొనుట అనవచ్చును, జైనకవులు రచించిన కొన్ని తెలుగు గ్రంథము లుండి యుండును జైనమతంతోపాటు అవికూడ నశించియుండును కవిజనాశ్రయ మునకు కూడ అట్టి దుర్గతియే పట్టెను అప్ప కవి చెప్పిన 'వికటకవులు కొన్ని వింతలు కల్పించి కవిజనాశ్రయమున గలిపినారు' అను పద్యపాదమునందలి వింతలలో గ్రంథకర్తృత్వాన్ని కూడ మార్పు చేయటం ఒకటి కావచ్చును. అప్పకవినాటికే ఆ మార్పు జరిగియుండును.

ముగింపు . కవిజనాశ్రయకర్త మల్లియ రేచనయేగాని వేములవాడ భీమ కవి కాదు. మల్లియ రేచన జైనశ్రావకుడు వాచకాభరణుడనే ప్రసిద్ధ బిరుద నామముగల జినవల్లభుని సహాయముతో అతడీ తెలుగుఛందోలక్షణ గ్రంథము

రచించెను. ఈ రచన కరీంనగరు జిల్లాలో వేములవాడయను ప్రాచీన జైనవిద్యా కేంద్రములో క్రీ శ 940 ప్రాంతములో జరిగి యుండును గ్రంథాంతర్గత సాక్ష్యము ఈ యూహను బలపరచుచున్నది వాదీభసింహ, వాదీభపంచానన ఇత్యాది బిరుదములు గల జైన విద్వాంసులు ఆనాడు అరికేసరి ఆస్థానములో నున్నట్లు ఆధారాంతరములను బట్టి తెలియుచున్నది. కాని మల్లియ రేచన గురువగు వాదీంద్ర చూడామణి యెవ్వరో తెలియదు.

—: ౦ :—

# 6. ధాన్యకటకము అమరావతిగ ఎపుడు మారెను?

—చీమకుర్తి శేషగిరిరావు

గుంటూరు జిల్లాలో, కృష్ణానదికి పశ్చిమపు తీరమున నుండి, అచటి ప్రాచీన స్తూప, శిల్పాదుల వలన నేడు అంతర్జాతీయ ఖ్యాతిని ఆర్జించిన అమరావతి, ప్రాచీన యుగమున బౌద్ధుల వలన 'ధఞకడ' లేదా 'ధమ్ఞకడ' అను పేరులచే వ్యవహృతమైనది తరువాత మహాయానముగ బౌద్ధము పరివర్తన చెంది సంస్కృతమునకు ఆదరణ లభించినపుడు 'ధాన్యకటక'గ 'ధాన్యవాటి'గ అది సంస్కృతీకరింపబడినది పల్లవుల కాలమున అచటికి అత్యంత సమీపమున ఒక కోట నిర్మింపబడగ అది తెలుగున 'ధరణికోట'గ పేరొందినది, నేటి అమరావతి ఆ కాలమున ధరణికోట నగరమునకు చెందినదిగనే లెక్కింపబడినది మధ్య యుగములందు ఆ ధరణికోట రాజధానిగా అతి దీర్ఘ కాలము ఆ ప్రాంతమును మాండలికులుగ పాలించిన 'కోట' వంశీయులు, నేటి అమరావతీ ప్రాంతమును 'ధాన్యకటకము'గనే తమ శాసనము లందు పేర్కొనిరి, వారు అమరేశ్వర పాదభక్తులు.

అమరేశ్వర దేవాలయము అచట ఎపుడు నిర్మింపబడెనో తెలియదు; పంచారామము లందలి తక్కిన ఆలయముల వలెనే తూర్పు చాళుక్యుల కాలమున అది రూపుగొనెనని సంభావించుట సహేతుకము. కాని, విమతానుయాయుల దండయాత్రల వలన ఆ ఆలయము ఎడనెడ ధ్వంసమైనందు వలన అచట రెండు పర్యాయములు పునఃప్రతిష్ఠలు జరిగినటుల అచటి శాసనముల వలన తెలియుచున్నది. అందు తొలుతటి దానిని క్రీ.శ. 1361 లో కొండవీటి రాజ్యపాలకుడగు అనవేమారెడ్డి నిర్వహించెను; రెండవ దానిని క్రీ శ. 1626 న జుజ్జూరు గ్రామవాసి యగు అంద్రికె పెద్దప్ప జరిపెను. వారి శాసనములందు ఆ స్థలము ధాన్యకటకముగనే పేర్కొనబడెను; అమరావతి పేరు కానరాదు.

ఈస్టిండియా కంపెనీ వారికి ఉత్తర సర్కారులు వశమైన కాలమున ధరణికోట తన పూర్వ ప్రతిష్ఠను కోల్పోయి చింతపల్లి జమీందారీలో చేరి యుండెను. చింతపల్లి జమీందా రగు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు, కంపెనీ వారి ఒత్తిడికి లోనై చింతపల్లిని వదలవలసి వచ్చెను అప్పుడతడు తన ఇష్ట దైవమగు అమరేశ్వరుని ఆలయమున్న ధరణికోట పరిసరములకు తరలి, అచటికి పలు ప్రాంతముల వర్తకులను చేరదీసి, వారికి ధన సాహాయ్యమును, నివాస వసతులను కల్పించి, అట ఒక నగరమును నిర్మింపజేసెను; తనకై ఒక రమ్య భవనమును కూడ అతడు నిర్మింపజేసికొనెను ఆ హర్మ్యము తరు వాతి కాలమున శిధిలమైనది ఆ శిధిలములను తొలగించి, పురాతత్వశాఖ వారు కొలది సంవత్సరముల క్రిందట సాగించిన త్రవ్వకముల వలన ఆ వెంకటాద్రి నాయుడు తన నివాసమునకు వైజయంతి అనియు, తన ఉద్యాన వనమునకు నందన వన మనియు పేరు లిడినటుల తెలియవచ్చినది ఇంద్రుని భవన, ఉద్యాన వనముల పేరులవి నాయుడు తనను ఇంద్రునిగ భావించుకొని అటుల పేరిడి యుండును; అందువలననే అతడు తన రాజధానికి ఇంద్రుని ముఖ్య నగరమగు అమరావతి నామమును గ్రహించెను ఇది అంతయు 1795-96 లో జరిగెను. జమీందారు యొక్క నెలవగుట వలన సర్కారు లెక్కలలోను ఆ పేరు చేరినది; 1797 లో ఆ నగరమును దర్శించిన కర్నల్ మెకంజీ, అమలున ఉన్న 'అమరావతి' నే స్థల నామముగ పేర్కొనెను అంతట అచటి స్తూప, శిల్పములును అమరావతీ స్తూప శిల్పములుగ వ్యవహృతాలై ప్రాచీనపు ధఞకడ, ధాన్యకటక నామములు ప్రజల స్మృతి పథముల నుండి దాదాపుగ లుప్తములైనవి



# 7. సార్థకపు పేరుగల ఉండవల్లి

## —అవధానుల విజయకుమారబాబు

స్థలనామాలు మొదట ఒక విశిష్టార్థముతోనే ఏర్పడుచుండును. పాణిన్యాచార్యుడు స్థలనామములు ఏర్పడు రీతిని వివరించుచు నాలుగు సూత్రములను రూపొందించెను 'చాతురర్థిక' అని వ్యవహృతమగు ఆ సూత్రములు ఇవి 1 తదస్మిన్ అస్తీతి (అష్టాధ్యాయి IV 2 67 ఆ ప్రజానీకము లేక అది ఇచట ఉన్నది), 2 తేన నిర్వృత్తమ్ (2 68, వారిచే ఇది నెలకొల్పబడినది); 3. తస్య నివాసః (2 69 వారు ఇచట నివసింతురు); 4. అదూరభావశ్చ (2 70. జ్ఞాతమగు ఒక స్థలమునకు చేరువలో ఉన్నది). ఈ నాలుగు సూత్రాలే ఈ ఆధునిక యుగమున సైతము కొలది మార్పులతో స్థలనామ పరిశీలనలో మనకు తోడ్పడగలవు

తెలుగుదేశమున స్థలనామ పరిశీలన శాస్త్రీయరీతిలో ఇప్పటికినీ జరుగకున్నది. చరిత్రను వ్రాయు పండితులు సైతము ఈ స్థలనామములను అంతగ పట్టించుకొనినటులలేదు కాని ప్రాచీన స్థలముల నామములు అవి ఏర్పడిన తీరు తెన్నులను స్పష్టము చేయుచున్నవి అట్టివానిలో ఒకటి ఉండవల్లి.

విజయవాడకు పశ్చిమమున, కృష్ణానదీ తీరమున, గుంటూరునకు దాదాపు 35 కి.మీల దూరమున ఈ ఉండవల్లి ఉన్నది. అచటి ఒక చిన్న కొండలో నాలుగు గుహాలయములు అంతరువుల రీతిలో తొలువబడినవి. ఆ గుహాలయములను తొలిపించిన వారిని గురించియు, వారి కాలమును గురించియు ఆంధ్ర దేశ చరిత్ర రచయితలు విభిన్నాభిప్రాయములను వెలువరించిరి. కాని 'ఉండవల్లి' అను గ్రామ నామమే ఆ గుహల చరిత్రను వెల్లడించుచున్నది.

'పల్లి' అనునది ప్రాచీన కాలమున తెలుగు దేశమున బౌద్ధుల విహారమునకు పర్యాయ నామముగ ఉండెడిది. (చూ పెరుంపల్లి). 'ఉడ్డ' అనునది పాలీభాషయందలి సంఖ్యావాచకపదము. రైస్ డేవిడ్స్ పండితుడు సంగ్రథనము

చేసిన పాళీ—ఆంగ్ల నిఘంటువు ఈ పదమునకు 'నాలుగవ' అను అర్థము ఇచ్చినది (పు. 129). కాని నాలుగు అను సంఖ్యావాచకముగ నైతము వాడిన ప్రయోగములను కూడ అత డిచ్చెను ఈ 'ఉడ్ఢ' అను పదపు వ్యుత్పత్తిని మాత్రము అతడీయలేదు సంస్కృతమునందలి 'ఊధ' పదమే పాళీ 'ఉడ్ఢ' అయ్యెనని భావించుటకు అవకాశము కలదు. 'ఊధ' అనగా పశువు యొక్క పొదుగు. పొదుగునకు నాలుగు చన్నులు ఉండును. కావున 'ఊధ' అను పదము 'నాలుగు' అనుదానికి పారిభాషిక పదమై ఉండును. సంస్కృతమున సంఖ్యా వాచకములను ఈ రీతిగ తెలియజేయు సంప్రదాయము కలదనుట సుప్రసిద్ధము. 'శైల' అనునది 'ఏడు' అను సంఖ్యను, 'అగ్ని' అనునది 'మూడు' అను సంఖ్యను - ఈ విధముగనే కొన్ని వస్తునామములు వేర్వేరు సంఖ్యలను తెలియజేయుచుండుట శాసన పాఠకులకు సుపరిచితము తెనుగునను 'చేయి' అనగా 'అయిదు' అను అర్థము కలుగుటయు ఈ తీరుగనే జరిగినది.

సంస్కృతమున 'ఊధ' పదమునకు నాలుగు అను అర్థము వాడుకనుండి అంతరించినను, పాళీలో నిలిచియుండినది పాళీ యందలి 'ఉడ్ఢ'యే తెలుగున 'ఉడ్ఢ' అయినది. 'ఉడ్ఢ' అన నాలుగనియే అర్థము. ఆ అర్థమున రాయలసీమ యందు ఆ పదము వాడుకలో ఉన్నది

సీ. చౌ యుడ్ఢ తీవంచ చౌకము నలు నాలు
గనగ జతుర్నామముల్ . సాంబనిఘంటువు పే. 29

ఉడ్ఢ + వల్లి అనగా నాలుగు విహారములు అని అర్థము 'ఉడ్ఢవల్లి'యే కాలక్రమమున ఉచ్చారణలోని పరివర్తనవలన 'ఉండవల్లి' యైనది పాణిని నిర్దేశించిన చాతురర్థికలోని నాలుగవ సూత్రమునకు ఇది లక్ష్యము. సుప్రసిద్ధములగు నాలుగు విహారములకు దాపున ఉండుట వలన అది 'ఉడ్ఢవల్లి'యై, కాలక్రమమున ప్రజల వాడుక భాషలో 'ఉండవల్లి' అయినది.

ఉండవల్లి వద్ద కొండలో ఉన్నవి 'వల్లి'లు అనగా విహారములుగ ఇందు వలన నిర్ధారితమగుచున్నవి విహారములు బౌద్ధులవి యగుట తప్పనిసరి కావున ఆచటి విహారాలు బౌద్ధులకై - ఆ మతము అత్యధిక వ్యాప్తిలో ఉండిన కాలమున, మౌర్య, శాతవాహన రాజుల పరిపాలనలో నిర్మితములయినవనుట సుస్పష్టము. ఈ విధముగ అన్వర్థకమై (ఒక విశిష్టార్థమును కలిగినదై) ఒక చారిత్రక సత్యమును వెల్లడించుచున్నది 'ఉండవల్లి.'



